# మార్పు

[నాటకం]

రచయిత:
తొట్టెంపూడి ధనకోటేశ్వరరావు.

వెలయువారు:
వెటనరీడాక్టర్,
చికినాల (మానికొండపోస్టు) (కృష్ణా)

2

తొలి కూర్పు
వెయ్యి ప్రతులు
జనవరి 1956
లీలాప్రెస్, విజయవాడ-2.

వెల: ముప్పావలా

కష్టాలకు వెరచి కాలవాహినికి బలియైపోతే
చచ్చి సాధించేదేమిటి ?

తెలుసుకోరా తెలుగుబిడ్డా
తెనుగుదేశం పోతుగడ్డ

## నా మాట

ఈ రచనా చాతుర్య సమరసమందు నా కొచ్చిన ఒడుదుడుకుల కనుగుణ్యంగా అడుగడుగున నాకు తోడ్పడిన నా మిత్రులకును, కొన్ని పాటలలో తోడ్పడిన శ్రీ రెంటాలవారికి నా అభివందనములు.

## హెచ్చరిక

నా లిఖితపూరితమైన అనుమతిలేకుండా, ఇందున్న వాక్యములు, పాటలుగాని, యెట్టివ్యాపారమునకైన, ప్రచురణగాని, ప్రదర్శనగాని జరిగినయడల నాచే జరుపబడు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురు.

—రచయిత

## సమర్పణ

దేశ సౌభాగ్యమే జీవితలక్ష్యమని గోవా సత్యాగ్రహంలో నేకదీక్షతో పాల్గొని అమరవీరులని చరిత్రలో ఖ్యాతిగని, అశువులుబాసిన జగన్, రామం, ఆంధ్రవిద్యార్థి సోదరులకు నా హృదయపూర్వకంగా అంకితము చేయుచున్నాను.

# పాత్రలు

జమిందారు—40, 45. సంవత్సరాలు.

సురేంద్ర—జమిందారు కుమారుడు (విదార్థి) 20సం॥

జగన్నాథం—సామాన్యరైతు 45, 50సం॥

పంకజ—జగన్నాథం కుమార్తె(విద్యార్థిని)18, 20సం॥

సుందరం—జగన్నాథం మేనల్లుడు 22సం॥<br>చివరకు పిచ్చివాడు

బిచ్చగాడు—60సంవత్సరాలు

గోతాం—జమిందారు బంట్రోతు 40స॥పైన

కవి—నిరుద్యోగి 45సం॥కుపైన

ప్రకృతి

# ఒకటవ రంగము

ప్రకృతియంతా ఏకాంతముగా యుంటుంది. ఒకమూల ఉట్టి వేళ్లాడుతూయుంటుంది. ఒక కుర్చీ రంగస్థలము మధ్యలో యుంటుంది. ఒక మూల మంచంకూడా యెత్తి వెనుకపెట్టి యుంటుంది. సామాన్య సంసారమున కవసరాలుగా సామగ్రి యుంటుంది మూలకింద రెండు కర్రలు పెట్టియుంటాయి. యింటినిండా పుస్తకాలు విరజిమ్మిఉంటాయి. యింటి యజమాని జగన్నాథం క్రిందకూర్చుని తాడు పేనుకొంటూయుంటాడు.

[తెర తెగుస్తుంది]

[కొద్దిక్షణాలు ఆగి పంకజ ఒక నవల పట్టుకొని వస్తుంది.]

జగన్నాథం: అమ్మా! పంకజా! ఎక్కడికి వెళ్ళావమ్మా ఇంత ప్రొద్దుపోయిందాకా... మాట్లాడవే?...

పంకజ: ఆ... ఏంటీ... నేనా... మా క్లాస్‌మేటు సుశీలఇంటికి వెళ్ళానాన్నా.

జగ: ఈడొచ్చిన పిల్లవు... అలా తిరిగితే ఎలాగమ్మా?

పం: అయితే... నేనేంచేశాను ?

జగ: కాదమ్మా నలుగురూచూస్తే యేమనుకొంటారు.

పం: అదిగోనాన్నా ...నీ కెన్నోసార్లు చెప్పాను. బయట వాళ్ళనుచూచి భయపడవద్దని.

జగ: అదేనమ్మా నేనూ చెబుతున్నా ...మనం నడిచే నడకంతా ఒక్కసారి వెనుదిరిగి చూచుకోమని.

పం: అయితే యిప్పుడేం జరిగింది?

జగ: అదికాదమ్మా మనము కళ్ళుమూసుకొంటే లోకం గుడ్డిదికాదు. ముందు నడుస్తూంటే వెనుక నాట్యంచేసే వింతజంతువులు చాలా వున్నా యీ లోకములో.

పంక: లోకం... లోకులు కాకులు. చెడుకు దూరముగా వుండే వాళ్ళకు మనకెందుకు.

జగ: అయితే సంఘానికి దూరమవుతావా?

పం: అవును మంచి ఎప్పుడూ చెడుకు దూరముగానే వుంటుందిగా.

జగ: మనంచేసే తప్పొప్పులను బయటపెట్టేదే సంఘం. దానికి దూరమవుతావా. పిచ్చిదానా.

పంక: అవును. తప్పొప్పుల విమర్శన లేకుండా హేళనచేస్తూ గొప్ప, గొప్ప ఆశయాలతో నిండియున్నవారిని చివరకు నికృష్టంగా తయారుచేసే దీ సంఘమే.

జగ: (కంగారుగా) దానికి కాదమ్మా.

పంక: [విసుగ్గా] దేనికి?

జగ: అంత తేలిగ్గా తీసేయగూడదమ్మా సంఘాన్ని. తాతల నాటినుండి వుంది.

పం: అందుకనే నాటినుండి బీదలు, బీదలుగనే నిల్చిపోయారు. ధనికులు స్తానికంగా నిలబెట్టుకొన్న ధనంతో, స్వార్థంతో మరింత ధనికులయ్యారు. బీద బ్రతుకు బీదే. అందుకనే సంఘంలో హెచ్చుతగ్గు లేర్పడ్డాయి. దానికి ఏర్పరచుకొన్నదే సంఘం. దాని పేరుతోనే పెద్ద లను కొన్న ధనికులంతా మన నెత్తిపై చేతులు పెడుతు న్నారు.

జగ: అదంతా ఎందుకులే అమ్మా! ఇప్పుడు.

పం: అవునాన్నా. కుళ్ళులేనిదే పురుగులెందుకు చేరతాయి. ఆ కట్టుబాటు మనలో ఉండాలిగాని.

జగ: ఊఁ...సరే...మాటలు నేర్చావ్.

పం: [కాసేపాగి] నాన్నా.........నేనుకూడా కాలేజీలో చదువుకోనా.

జగ: చదువుకొన్న వాళ్ళంతా వుద్ధరిస్తున్నారు. ఇక నువ్వుద్ధరిస్తావు...ఏదో ఇస్కోలుపైనుదాకా చదివావుగా చాల్లే. ఏదో ఆ మూడుముళ్ళు వేస్తే చాలు.

పం: ఎప్పుడూ పెళ్ళి... పెళ్ళి యంటావు, పెళ్ళి కాకపోతే బ్రతకలేరా నాన్నా.

జగ: నీకు తెలియదమ్మా...నన్నెందు కల్లరిపాలు జేస్తావ్. యీ జగన్నాథాన్ని కాస్త పరువుగా బ్రతకనీతల్లీ!

పం: చదువేంచేస్తుంది నిన్నల్లరి.

జగ: అమ్మా యీరోజుల్లో చదువు పేరుతో కాలేజీలకుపోయి కళ్యాణమండపాలు సృష్టించిన వా రెందరులేరు. ఇలాంటి వాళ్ళెందర్ని మనం చూడ్డంలేదు.

పం: చదువుకొనేవాళ్లు లేనిదే లోక మెట్లా నడుస్తుంది. ప్రజాసేవకై నిలచి, ప్రజాయోగ్యమే మనయోగ్యమని యెంచి, దేశ ఔన్నత్యాన్ని కాపాడాలంటే, కనీసం దేశంలో కొంతమందైనా బ్రహ్మచారులుగా వుండాలి.

జగ: లోకమంతా చదువుమీదే నడుస్తోంది. అయినా మన కెందుకమ్మా చదువు. అదేదో డబ్బువున్నవాళ్ళకుగాని సరదాగా...అయినా ఆడపిల్లలకు చదువెందుకు? ఎంత చదివినా కూడుసద్దేరాతేగా. కాస్త పరువుగా బ్రతికే వారని బ్రతకనీయి తల్లీ. ఆ సిల్కు సిల్కు డ్రస్సులు ఆ పౌసస్లు ఆ గోటుకుంటూ నీటుకుంటూ నడుస్తూ టాకుటీకు.గా

వేసే ఆ పంజాబీ డ్రస్సులు అమ్మో మనం భరించలేము వద్దు తల్లీ.

పం: అంతేనా?

జగ: అంతేకాదు. కాలేజీల్లో చదివొచ్చిన తెలివితో చేసేది లేక గర్వంగా యింటిదగ్గర మాబోటి ఓనామాలు రాని మెరిసే తలపై కాలేకుంపటి పెట్టడానికి పనికివస్తుంది. అంతేకాని......

పం: నాన్నా గొప్పగా చదివి దేశానికి నాయకత్వం వహించి స్త్రీ జాతికి ప్రతిష్ఠ తెచ్చిన ఝాన్సీ, రుద్రమాంబ, సరోజినిలలాంటి శిరోమణు లెందరు లేరు.

[సుందరం ప్రవేశం]

సుందరం: వున్నారు; వున్నారు. చాలామంది వున్నారు. అందుకనే వారికున్న సార్థక నామధేయాలు వీరు తగిలించుకుని వారి కప్రతిష్ట తెస్తున్నారు. అంతేకాదు నడిచే నడకలో తెలుగుతల్లి కళ్ళనుండి కన్నీరుకూడ కారుస్తున్నారు.

జగ: [సుందరంవైపు చూస్తూ] యీడే B. A., M. A.లు చదివిబిక్షాపకీరులాతిరగటంలా. అంతాఇంతే. ఈరోజుల్లో డిగ్రీలు వర్షంలో వరిగిళ్ళు. వున్నదంతా ఖర్చుచేసి వుద్యోగమో రామచంద్రా యంటూ యిపుడేడ్వటంలా. యీడేకాదు ఒక్కసారి కన్నెత్తిచూస్తే అందరికీ తెలుస్తుంది. డిగ్రీలు పుచ్చుకొన్న వాళ్ళంతా కీసీళ్ళక్రిందే యుంటారు. అయినా ఆళ్ళకుమాత్రం బుద్దొండొద్దా

డిగ్రీలిచ్చేవాళ్ళు ఉద్యోగాలీయలేని దద్దమ్మలైతే యీ బళ్లూ కాలేజీలూ కొన్నాళ్లు మూసెయ్యరాదు.

సుం: (కుర్చీలో కూర్చుని) బాగుంది. మూసేస్తే లాభాలు గూబల్లో కెళతాయి. ఇట్లాఉండబట్టే చేసేవాళ్ల మోసాలు పట్టుకోలేకుండా యీగతి కొచ్చాము. మనంకూడా ఏ వ్యాపారమో చేసుకొని...

జగ: ఏంచేయమంటూ: చెప్పరా సుందరం చెప్పు.

సుం: ఏం చేయమంటూరా: ఎన్నిలేవు, ఆబారన్లు:

పం: చాలు, చాలు, ఆ బ్లాకుమార్కెట్లు, మారుబేరాలు జేబులుకొట్టడం యిలాంటి ఘరానా దొంగతనాలు మానాన్నకు చేతగావు.

సుం: అదీ నిజమే. అలాంటి ఘరానాదొంగతనాలు చెయ్యాలన్నా మీావల్లేమవుతాయి. అవిచేసినా యీ డిగ్రీలిచ్చిన దౌర్భాగ్యులన్నా చెయ్యాలి లేకపోతే డిగ్రీలు పుచ్చుకున్నయీ నిర్భాగ్యులన్నా చెయ్యాలి.

పం: చాల్లే నీ పంచాగం. పిచ్చివాడు పిచ్చిగోల.

సుం: అవును నిజానికి నిలయంకాదులే యీ లోకం.

పం: ఏం? నాన్నా అసలు సంగతెచెప్పవు?

జగ: సరే. అమ్మా నీ యిష్టమొచ్చినట్లుగానే చదువు కొందువుగాని... మీా అమ్మమ్మ వ్రాసియిచ్చిన నీ చారెడుభూమి వుందిగా.

పం: అవును... మరచా. నా భూ ముందిగా.

(గంతులేస్తూ యింట్లోకి పోతుంది)

సుం: ఉ...ఉ...ఉ... మగవాళ్ళు మాటలతో దళ్ళే కడ తారుగాని, ఆడవాళ్లు ఆడంబరంగా కోటగోడలే కడ తారు. ఇంకా ఆర్థికస్వతంత్రమట. చివరకు దాని విలువ కూడాపోతుంది.

జగ: ఏరా నీ బ్రతుకింతేనా సుందరం నేను బ్రితికినంత' కాలము నా కేమి తప్పదు.

సుం: ఏం చేయమంటా?

జగ: తింటాని కెలావస్తుంది?

సుంద: నువ్వున్నంతకాలం.........

జగ: దౌర్భాగ్యుడా. ఇంకా నన్ను విడిచిపెట్టలా. నీ ఇనుప హాస్తాలతో నన్ను నలిపేయదలిచావా. ఇంకా హేళన. అవును అంతా హేళన ఏదో దిక్కులేనివాడవని మేనల్లుడు గందాయని లోకాని కెరచి చేస్తే ఇదా నువ్వు చేసేపని.

సుం: నౌకరీ దొరకందే ఏంచేయమంటా మామయ్యా.

జగ: మామయ్యా! నీచుడా! నీ నో రెలా ఆండిందిరా ఆ మాట అనడానికి. ఏ అడుక్కుతిని బ్రతకరాదు.

సుం: (నిట్టూర్పుగా) ఇపుడదీ లాభంలేదు. మొదట నువ్వు చేరదీకుండాయుంటే అపుడలాగే జరిగేదేమో. కాని యిపుడా చదువువల్ల బిక్షముకూడా దక్కదు. చదువు విలువనంతగా మారింది. ఏ గడపజూచినా నీలాగే యంటారు. అందరికీ సాక్షం చదువేగా.

జగ: ఇటువంటి మాటలతో నన్ను మరింత మండించబోకు ......ఇంతకీ కారణం నేనంటావు... నేనుగాదు... నేను గాదు. నీతినియమంలేని యీ సంఘం......యీ సంఘా

నికి జడిసి చేసా... అపుడు నా ఆత్మనశించింది.... ...జీవ ముడికిన దేహంలో చిచ్చుబెట్టకు... నన్ను వేధించకు... దయకు కాలంగాదు.

సుం: అపుడు ఆత్మ నశించింది. ఇపుడు వికశించింది... ... ఎంత పనికిమాలిన పని... అసలా ఆత్మనే పదార్థమెక్కడుంది... ప్రపంచమంతా పచ్చి మోసంమీద నడుస్తోంటే... యింకా ఆత్మట... ఆత్మ... ప్రతివ్యక్తికి వాంఛ బలమైనకొద్దీ మనస్సులు స్వాధీనం తప్పుతాయి... నువ్వుమటుకు నువ్వు. నాక్షేమంకోరి నన్ను చేరదీసావా? నా ఔన్నత్యంజూచి చదువు చెప్పించావా?... అంతా నీకూతురు పంకజంకోసం ...ఎనకాల ఏదోకాస్త ఆస్థివుందని... ...

జగ: చాలు, చాలు, పాపపుమాటలు... అదంతా చట్టవిరుద్ధం.

సుం: కాదు... యిదంతా సంఘంపేరుతో కల్లగప్పే కుతంత్రిచట్టం. ఇదంతా స్వార్థం. లోకంలోయున్న అంటువ్యాధే నీకు అంటింది.

జగ: (కటువుగా) ఇదంతా నీ క్షేమంకోసమే చేసా. యీ సంఘానికి క్షేమకరమైనదే ధర్మం. దానికి కష్టం కలిగించేదే అధర్మం. దీనివల్ల సంఘానికి కల్గిన నష్టమేంటి?

సుం: సంఘం మన కట్టుబాట్లమీద ఆధారపడివుంది. ఆకట్టుబాట్లను బ్రద్ధలుచేస్తే సంఘం అంతరించిందన్నమాటేనా?

జగ: నిజంగా నీవు మాట్లాడే మాట లేకాలపుమాటలో నాకర్థం కావటంలేదు. సంఘంవల్ల మనం సాధించ

గల్గిందంతా సాధించి తీరాలి. ప్రయోజనం పొందగలందు లకే అవన్నీ సృష్టించబడ్డాయి...సంఘ సంబంధమయిన సాధనాలద్వారా మనం నెరవేర్చుకోగల్గిన దంతా నెర వేర్చుకొనుటే లౌకికానికర్థం. అయితేనేం నే చేసిం దంతా పాముకు పాలుపోసినట్లయింది. తేలుకు కొండె విరిచి సంపూర్ణ శాంతిజీవిగా చెయ్యవచ్చునుగాని, అందు వల్ల తేళ్ళకుండే విషతత్వం నశించదు.

సుం: మీరంత ద్వేషంగా మాట్లాడవలసిన అవసరంలేదు. మీపనేదో మీరు చూచుకోండి. నా ముఖం మళ్ళీ చూడలేరు. (అంటూ మూలనున్న చిన్న కర్ర తీసు కుంటాడు)

జగ: పో...నీ దారినే నువ్వుపో, ఏ పాలేరుపనో చేసుకో. బ్రతుకు నీ బ్రతుకు...నీ తాతలపిచ్చే నీకూ వచ్చిందను కుంటాను.

సుం: అయితే నే పిచ్చివాణ్ణా?

జగ: అవును. పిచ్చివాడవే. తమ మెదడు ఆడరులోలేదు. పిచ్చివాళ్ళలాగే మాట్లాడుతుంటారు. ఎవరినైనా కరవ డానికి పోయేవాడుగాదు పిచ్చివాడు. మామూలు మను ష్యుల ప్రవర్తనకు విరుద్ధంగా ప్రవర్తించడంకూడాపిచ్చే.

సుం: అసలు మీరే పిచ్చివాళ్ళు.

జగ: అది నిర్ణంచేసేది డాక్టరు.

సుం: నేను లెక్కలేనన్ని పుస్తకాలు వ్రాసాను. అనంత మయిన ఉపన్యాసాలిచ్చాను. నే నెందుకు పిచ్చివాడ నవుతాను.

జగ: ఇదంతా పిచ్చే... ఇదంతా పిచ్చివాళ్ళు చేసేపనే... కూటికి గుడ్డకురాని పనులెందుకు పో నా యింటిలోంచి పో. అన్నిటికి నాకూతురు పంకజే యనుకొంటా.

సుం: వెళ్ళిపోతున్నా. నేనే వెళ్ళిపోతున్నా. నీకూతురే నీఆశ తీరుస్తుంది. ఆడవాళ్ళ ఆడంబరాలు నీ కర్థం కావులే. పో చివరికి కాస్త మట్టికూడా వెయ్యడు.

జగ: పోరా... ...పో... దౌర్భాగ్యుడా... చచ్చినవాళ్ళలో నువ్వు ఒకడవనుకొంటా... అమ్మా పంకజా... పంకజా.

(తెర సమయానుకూలముగా పడుతూ లేస్తూ యుంటుంది. సుందరం పిచ్చివాడులా మారుతూ తెరచుట్టూ తిరుగుతూ యుంటాడు.)

తెర వెనుక (పాట)

చూడుమురా విధీ... ...
విలువనిపెట్టిన చదువుపేరుతో
దారితెలియక పతనమైనా
సుఖంకోరిన బ్రతుకుభారమైనా,
ఘనతనియెంచిన బ్రతుకే తీరనిఅగచాట్లైనా.
యింతేలే విలువింతేలే
చదువుగాంచిన విలువింతేలే.
స్వార్థపుహృదయంలో కాదదినిలయంలో
చుట్టాలకు పట్టాలిచ్చే
సిఫారసనెడి తటాకమందు
బికుదుల కెక్కడ తావున్నదిరా
పల్కురుపల్కిన పిచ్చేవిధియని

కాలము తరబడిపోరా...

అదిగో వేచియుండు మదిగో

ప్రపంచ పరిణామతృష్ణకొరకు.

---

# రెండవ రంగము

అందమయిన మేడ. అన్నిరకాల లైట్లు వెలుగుతూ యుంటాయి. రంగస్థలముపై మూడు కుర్చీలు, ఒక డ్రాయరు టేబుల్ క్లాత్ అనుకూలముగా వేయబడిఉంది. సూర్యోదయమవుతూంది. కీచుకీచుమంటూ పక్షులు కూతలు కూస్తున్నాయి. బంట్రోతు 'గోతాం' కుర్చీలో కూర్చుని కాళ్ళు డ్రాయరుపై బెట్టి నిదురపోతూయుంటాడు.

[తెర లెగుస్తుంది]

జమీందారు: (ప్రవేశిస్తూ) అరె... ఛీ... దౌర్భాగ్యుడా... గోతాం?...

గోతాం: (ఉలిక్కిపడి ఆవలింతకొడుతూ చూడకుండానే) ఎప్పుడు వస్న నువ్వు. (పడుకుంటాడు)

జమీం: ఇందాకావచ్చిందా. నన్నే ఎవడురా యంటున్నావా. నీ నిదురనీవుచావ... లేరాగోతాం... ఒరేయ్?... నేనేరా లే... నేను ... జమీందారును... లేరా...

గో: ఎప్పుడు ఏంటహో రొద. మంచి రబసగాయుంటే (లేవకుండానే, పడుకునే)

జమీం: (వెర్రిచూపులు)

గో: నేనే... నేను ... జమీాందారును ......ఆ... ఎందు కయ్యా అంతగోల... ఆ... సిస్తులువద్దూ ఏమీావద్దు... బాబో నన్ను ప్రాణాలతో వదలండి... మీాకు దణ్ణం పెడతా... మీారు చేసేపాలాలు మీావే. మీారు కోరు కునేదుక్కి దున్నేవాడికేభూమి... అవును బాధ్యత యున్నవారికి హక్కుకూడావుంది... ఆ... కర్రెత్తు తున్నారా... బాబో...(అంటూ కుర్చీలోంచిలేచిహడా వుడిగావచ్చి జమిందారుకు తాకుతాడు. ఇద్దరూ క్రింద బడతారు.)

జమిం: (పేనుకర్రతోకొట్టి) లేరా గోతాం లేరా.

గో: అయ్యా... అయ్యా... మీారెప్పుడు వచ్చారయ్యా (లేపి దులుపుతూ)

జమిం: నేనా...వచ్చా...వచ్చారా...వచ్చా...

(కుర్చీలో కూలబడుతూ)

గో: నెమ్మదిగా కూర్చోండిబాబు. రోజులు బాగుండలేదు.

జమిం: ఏం...రా...నీకూ్కడా ఏంజరిగింది.

గో: అదేటండి బాబుగారు మాయదారి రోజులు. పెద్దమనిషి లాంటి జమీాందారు తల్లకిందులైనందుకు...

జమిం: ఎవర్రా ఏం జరిగింది.

గో: ఏటుండి అయ్యగారు అట్టంటారు. నేను బీదోణ్ణి రోజూ 99 సార్లు పడుతూ లేత్తుంటాను. మీారుకూడా మాకు మల్లె పడిపోయారేంటుండి.

జమిం: అవునుగా అవును. రోజులు మనవికావురా మారి పోతున్నాయి.

గో: అంతేనయ్యాఅంతే... పాపంపెరిగిపోతూంది... అందుకే (జమీందారువైపుచూచి) అదేంటయ్యగారో చొక్కా చిరిగింది... కోటుకు తూటుబడింది... బాబో... ఏంకుంబ కోణం జరిగింది... యిదేంది నాయనో వంటినిండాబురద మాసికలు... ఏంటండి.

జమిం: కళ్ళుపై కెక్కాయిరా... కళ్లు పైకెక్కాయి.

గో: ఓస్... యింతేనా. దోవకనపడకపడ్డారా... డాక్టరును తీసుకొస్తా.

జమిం: డాక్టరేంచేస్తాడురా మదమెక్కిన జబ్బుకు...

గో: అవునుబాబయ్యా. మరి డబ్బెక్కువుండగూడదు. డబ్బు పొరలు గ్రమ్మిస్తుంది. అది గడ్డితినిపిస్తుంది.

జమిం: అదిగాదురా దున్నపోతా...

గో: మరేంటయ్యా ఎవరన్నా కొట్టారా?

జమిం: అవునురా. కాలం మీ బీదలంజాకొడుకులకే వచ్చింది.

గో: ఆ......ఆ... ...అదుండబట్టే... ...అంతపని చేశారు. అయినా ఒకప్రక్కన తెల్లవారందే అప్పుడే కొట్టడ మేంటిబాబూ.

జమిం: కాదురా రాత్రి...

గో: అయితేమట్టుకు అంతా నా పెళ్లాంలాంటివాళ్ళుంటారా?

జమిం: కాదురా నే నెవరినేం చేయలేదురా.

గో: అయితేయేంటి... ...ఓస్ అదా.

జమిం: అదీలేదు, ఇదీలేదు... ఏదీలేదు.

గో: ఏమన్నా అమ్మగారు...

జమిం: అవేవీకాదురా.

గో: మరింకేంటయ్యగారో.

జమిం: సిస్తులు కట్టమని దివాన్‌చేత కబురుపంపిస్తే వారు ధిక్కరించారట. సరే నే వెళ్ళి అడిగాను.

గో: ఏమన్నారు?

జమిం: ఏమంటారు. మాకు వరదలువచ్చి పైరుపొలాలన్నీ పాడయ్యి పంటలన్నీ నాశనమయ్యాయి. ఇప్పుడుకట్టలేము ధాన్యము అమ్మి డబ్బుకడతామన్నారు.

గో: అవును నిజమేగా...

జమిం: కాదురా మరికావాలిగదరా. మొన్న రంగయ్య వచ్చివెళ్ళలేదు.

గో: ఆ. ఆ... ఆమూడువేల రూయలకు యివ్వలేదుగా.

జమిం: ఇస్సు... అనబోకు... పోలీసులుంటారు.

గో: పరవాలేదు... అంతా డబ్బుచేతిలో కీలుబొమ్మలేగా.

జమిం: నేను ఖచ్చితంగా ఇవ్వమన్నాను. కానివాళ్ళు రూపాయకు కాన్లుకూడా కట్టలేమంటున్నారు ... కావాలంటే... అంటూంటే నాకు వల్లుమండింది. సరే చూసుకోమని రాత్రి కుప్పలునలిపించి ధాన్యం తోలిస్తోంటే అడ్డమొచ్చారు ఒకమంద మంద.

గో: పాపం. వల్లుమండదూ.

జమిం: ఎవరికీ.

గో: ఆ...ఆ... మీకేనండి.

జమిం: సరే విను. కర్రలెత్తారు. నేను. నామోచేతికిరింద నీళ్లు తాగి బ్రితికినవాళ్ళు నామీద కొస్తారాయని ఎదిరిం

చాను. కాలం మారింది యీ అరాచకాన్ని మేం తట్టు
కోలేమంటూ కొట్టబోయినందాక వచ్చారు.

గో: అమ్మయ్యో.

జమిం: నేను అవతలికి పొండిరాఅని మనపాలేరుసుబ్బణ్ణితోసా
ఇంకేముంది. కర్రలు దబదబా పడ్డాయి.

గో: అయితే పారిపోయొచ్చారా.

జమిం: ఏం చేయను.

గో: సరే. అనుకున్నంతయింది. మరి బుట్టలోళ్ళంతా మనో
ళ్ళేగా చెప్పక ...

జమిం: ఎందుకు ఇంటిగుట్టు రచ్చకెక్కించుకోవడం.

గో: బాగుంది. అయినా నాకెందుకులెండి. అయ్యగారో.
ఇంటికాడపిల్లలు చచ్చిపోతుండారట. కాస్త జీతమీ
యండి. పొట్టుతారీకుదాటి చానాదూర మయింది.

జమిం: డబ్బా డబ్బా ఎక్కడతేను. కర్మంగాలి మొన్న
లక్షరూపాయలు గుర్రపందాల్లో పోయినాయని ఉత్తరం
కూడా వచ్చింది. నేనేమో 10, 15 నో లక్షలు వస్తా
యనుకుంటే ... ...

గో: అయ్యోత్తాయనేగాబాబు కోమటిపుల్లయ్యది 300 ఎక
రాలు వేలంచేసారు. ... నిజంగానే కాలమారింది బాబూ
అందుకనే నా కా పీడకలొచ్చింది. మాయదారిది ...

[కవి ప్రవేశం]

కవి: (వస్తూనే) ఇంకా సూర్యోదయం కాలేదు. తూర్పుతట్టు
ఎర్రవారింది. జగమంతా 'కలకల' ధ్వనులతో నిండింది.

పెల్లున తుపానుచెలరేగింది. పక్షులు కిలకిల రుయ్‌మంటూ పరిగెత్తుతున్నాయి. అదిగో కోరీలమధ్యగా వర్షపునీరు సెలయేరులా ప్రవహిస్తూంది. తీక్షణమైన గాలివత్తిడికి కొమ్మలువిరిగి బోడితలలు వేసి వృక్షాలు విచారాన్ని వెలుబుచ్చుతున్నాయి. రహదారి రోడ్లన్నీ వాగులనుండి వచ్చిన గులకరాళ్ళతో నిండివుంది. రైతులు భూదేవిని గొల్చుటకు పరికరాలతో వెళ్లుతున్నారు. ఇదిగో జమీం దారుగారు సయితము మేల్కొనియేయున్నవారు. ఓ అఖిలమండాధిపా, ఆర్తరక్షకా, ఆపత్‌బాంధవా, భూలోక రక్షకా, అధర్మమూర్తి, కుటిలశకితా అభివంద నములు.

జమిం: కూర్చోండి ... కూర్చోండి.

కవి: మీ అభినయములుగాదు మీ ఆదరణ కావాలి.

జమిం: అంత తొందరేమిటోయ్. మెడకు తగులుకున్నది గనుక వాయించక తప్పదనే మనుష్యులంటే నాకసలు బలేమంట.

కవి: ఎద్దుపుండు కాకికి ముద్దులెండి.

జమిం: నాకా అధికారమేఉంటే ఆపని నే నే చేసెయుండే వాడిని.

కవి: లేదు దయామయా. మీ కడ కరతలామలకములే.

జమిం: ఇంతకూ నువ్వొచ్చిన పనేమిటోయ్.

కవి: ఏదో మీ ఆస్థానకవిగా తీసుకొని నన్ను మా కుటుంబాన్ని పోషిస్తారని.

జమిం: చేసేపని. దేని నిమిత్తము, ఉపయోగము?

కవి: (నిట్టూర్పుగా) అదికూడా తెలియనివారున్నారా. మన మూడుకోట్ల తెలుగుప్రజలు ఒక్కజాతిబిడ్డలు. వెన్నంటి వచ్చినభాష తెలుగు. మీరందరూ భాషాసాహిత్యం రచించి పుస్తకములను ముద్రించి ప్రజలకు పంచిపెట్టండి. ప్రజాసాహిత్యం ప్రచారం కావలదా.

జమిం: అయితే కళ?.

కవి: కవిత్వానికి కళలతో సంబంధంలేదు. మూడుకోట్ల అఖిలాంధ్రులారా మీ రందరూ కళోపాసకులు. ఎవరి శాశనములను పాటించవలసిన అవసరంలేదు. ఎవరికివారే ఒక సాంప్రదాయం. ఎవరికివారే ఒక మహోద్యమం. బానిస బంధాలు బ్రద్దలుజేసి, చరిత్రలో సువర్ణాక్షరాలతో మొదటిపుటలో వ్రాయించి, భరతమాతకు తొలిబిడ్డలని ప్రశంసించి, ప్రజాస్వామ్యాన్ని ప్రతిష్టించిన ఆదర్శమయిన ఆంధ్రప్రదేశం బంగారుభూమి. తెలుగుజాతి పోతుగడ్డ. ఇది ప్రజాయుగం... విశ్వవిద్యాలందరికుచితంగా చదువు చెప్పకపోయినా డిగ్రీలీయూల. అయినా మనమేం తక్కువ? మనం గీసేగీతలు అవనీంద్రనాథ టాగోర్ వ్రాసిన మహోన్నత చిత్రాలకంటె గొప్పవి. మనం వ్రాసేరాతలు. విశ్వకవి రవీంద్రుని వాఙ్మానంకన్న మిన్న.

జమిం: ఏమిటోయ్ యీగోల.

గో: అదేంటుండయ్యగారో. ఈ కవులకుండే పిచ్చేగా. అధిక వాగుడు... ఆసులోగొట్టాం. పానకంలో పుడకలాగ మధ్యలో-ఇంటికాడమంచవసరంబాబూ. కొద్దిగానన్నా.

జమిం: ఆగవోయ్ మధ్యలో నీగోల. అసలు నీవనేమిటోయ్

కవి: మా పాండిత్యాన్ని పోషిస్తారని.

జమిం: నన్నేంచెయ్యమంటావోయ్. నాదినాకు దక్కకుండా ఉంటే.

కవి: ఏదయినా మీదయ మా ప్రాప్తి.

జమిం: మాటలు నేర్చావ్.

కవి: బీదవాళ్ళంబాబూ. సృష్టికి మార్గాలుచూపి ఊహా ప్రపంచాలకు బాటలువేసే కవులను పోషించలేని యీ అసమర్థత దేశంలో దిక్కులేక తిరుగుతున్న బీదవాణ్ణి.

జమిం: సరే నీకులమేమిటి?

కవి: బీదకులం.

జమి: ఏమిటోయ్ నీగోల. డొంకతిరుగుడు మాటలు.

గో: కవిగారుబాబు. ఎల్లికి పిల్లి, పిల్లికి మల్లి ... ...

జమిం: చాలు. చాలు. నీమెట్టవేదాంతం.

గో: అంతేలే.

కవి: ఈనాడు లోకంలోయున్నవి రెండుకులాలు (1) బీదకులం (2) ధనికవర్గం.

జమిం: (కోపంగా)...ఊ...అయితే అసలు నీకు కులంలేదా.

కవి: ఇదిగో జంధ్యము.

గో: దారపు పోగులేగా.

కవి: చూపులకు దారపుపోగులేకాని. ఈ జంధ్యంలో యున్న పోగులన్నీ దేశాభ్యుదయాన్ని దేశఔన్నత్యాన్నికాపాడే నూతన పాటలు.

జగ: చాల్లే నీ కోతలు; నీ డిగ్రీలేమిటి.

కవి: డిగ్రీలా! విశ్వకవి. విద్వాన్. చక్కర్ పొంగలు ఇంకా...తిక్క మార్క్గాట్.

గో: చక్కర్ పొంగలే (నోరుచప్పరిస్తూ)

జమిం: చాల్లే నీ చక్కర్ పొంగలూ నువ్వు (కవివైపు చూస్తూ) M. A. B. A. లు లేవూ.

కవి: అవి అహర్కృగా అడిగి పుచ్చుకొనే డిగ్రీలు మా విసార్ధక నామధేయాలు.

జమిం: అయితే 'రికమండేషన్'

కవి: ఎందుకండీ నిరుద్యోగసమస్య నిర్మూలించటానికి మీవంటి......

జమిం: అయితే...ఖాళీలేదు.

కవి: అయితే మీ భార్యగారేనండి.

జమిం: ఏంటీ నా భార్య నీకు రికమండేషనా?

కవి: అవును నాయనా. ఆమెకు చిన్నతనంలో అక్షరాభ్యాసంచేసింది నేను. ఆమెనాకు శిష్యురాలు. అదృష్టవశాత్తు మీకంటబడి అంతఃపుర సౌధాలలో అడుగుపెట్టింది. అందువల్ల ఈ చిన్నపని చేయలేదా.

జమి: ఛీ నీచుడా పో అవతలికి. నాభార్య నీకు శిష్యురాలా.

కవి: అవును. దేహాలుగాదు భాష. మాతృభాష నంత తేలిగ్గా చూడొద్దు మీరుపోషించేది నన్నుకాదు. మన మాతృ భాషను.

జమి: మాతృభాష నీతలకాయ్. పో అవతలికి. నీలాంటి దౌర్భాగ్యులుండబట్టే లోకమీగతి కొచ్చింది......

మింగటానికి మెతుకులేదు మీసాలకు సంపెంగనూనెట. కవిత్వమట. మాతృభాషట. తెలుగట.

కవి: (కోపంగా) క్షమించండి. అమృతమయిన నాకవిత్వ ధోరణిలో నిన్నుందలా లెక్కించాను. దానివల్ల నా కవిత్వానికి కళంకంకూడా కలిగినది ధనమదాంధుడ వయిన నీకేమి అర్థమవుతుంది మాతృభాష మర్మము. నీవేకాదు, నీకన్న ధనమదాంతులు, గర్వపోతులు మాతృభాషకు కళంకముతెచ్చి చీటికిమాటికి ఇంగ్లీషు మాట్లాడే పెద్ద దద్దమ్మలు లేకపోలేదు. (ప్రజలవైపు చూస్తూ) ఇలాంటి వారెందుకు మన దృష్టిలోకి రారో అర్థంకాదు. ఈ ప్రపంచములో మొదట ప్రవేశించగానే చూచేది తల్లిమొఖం. మొదట పలికేది తల్లిభాష అట్టి తరి ఘూభాషను మీరు న్యూనతగా మాట్లాడ్డం దేశ ద్రోహం, మాతృద్రోహం. మీ శరీరఛాయలా మీ చేతి వేళ్ళలాగా మాతృభాషగూడా మీ శరీరంలోను, మీ జీవితంలోను ఒకభాగం. అది మర్చిపోయి అనర్గళంగా చీటికిమాటికి అరవంలోను, ధారాపాతంగా ఇంగ్లీషులోను మాట్లాడేస్తుంటారు. కాని మాతృభాష మరుపురాదు. గేటుశ్ణౌము సైడుప్రక్క చివరకు Now ఇప్పుడుకూడా అంటుంటారు. కాని ఇతరభాషలవారితో మాట్లాడేటప్పుడు అన్యభాష అవసరమే. భాషాప్రావీణత గూడా ఒక భాగ్యమే అయినా స్వజాతీయునితో తెలుగు మాట్లాడండి. లేకపోతే నాగరికత నెత్రితలలు వేస్తుంది. బహుభాషావిశారదుడైన శ్రీకృష్ణదేవరాయలు తన

మాతృభాష కన్నడమని కొందరన్నా నిష్పక్షపాతంగా "దేశభాషలందు తెలుగు లెస్స" యన్నాడు. తెలుగు మర్మమెరిగి తెల్లహాడానాడే చెలామణీ నాణెములపై తెలుగు ముద్రించాడు. అయిన మనకు శంఖంలోపోస్తే గాని తీర్థంకాదు. ఆ పాశ్చాత్యులే "ఇటాలియన్ ఆఫ్ ది యీస్ట్" అన్నారు. అతి సుందరమయినది మన భాష, జాతీయతా చిహ్నం. అది మర్చిపోవద్దు. ముఖ్యంగా తెలుగులో సాహిత్యంలేదనే వారికి, ప్రబంధాలు, భారత భాగవత రామాయణాలు చదవమని చెప్పండి. అవి బద్ధకమయినవారికి వ్యవహారికభాషలో వ్రాయబడిన 'మాలపల్లి' 'చెలియలికట్ట' తుఫాను' చివరకి మిగిలేది మొదలయినమహాకవులనవలలుచదవమనిచెప్పండి అవీమాకు ఇంగ్లీషంత అర్థముగావంటే, యెంకిపాటలు, కిన్నెరసానిపాటలు, కోకిలమ్మపెళ్ళి, మొదలయిన జానపదాలు యివ్వండి. అదీమాకు రాదంటే అలాంటివారు మన తెలుగుదేశంలో పుట్టినందుకు పడుస్తూ ఊరుకోండి తెలుగుభాషయిన మాతృభాషకు కళంకంతెచ్చి యెంగిలి కూటికాసించి, దాన్నే ప్రాధాన్యత యంచేవారందరూ వీరకుంకుమ నొసటధరించిన మన తెలుగుతల్లికి సవతి బిడ్డలనుకోండి. మాతృభాషను మరువవద్దు—

జమి: అరె గోతాం!

గో: ఆ...

జమి: ఆతాడు తీసుకురా. నోటికిష్టమొచ్చినట్లు ప్రేలుతున్నాడు.

కవి: వద్దునాయనా వద్దు. అంతగొప్ప కార్యానికి పూనుకో వద్దు. నీ యినుపసంకెళ్ళతో బంధించలేవు. ప్రజాశక్తి నాపలేవు.

గో: (బెదిరిస్తాడు.)

వి: (పారిపోతాడు)

గో: చూచారా. అసలు సరుకు తక్కువ ఉలుక లెక్కువ.

జ: ఆశలెక్కువ ఆలోచన తక్కువ. ఉద్యోగమట. సిఫారసట.

గొ: అంతేగా బాబు.... బాబూ ఆసలుసంగతి చెప్పడానికి బయపడ్డాను.

జ: ఏమిటి మళ్ళా నీగోల.

గొ: అదే బాబయ్యా. ఇందాక మా అమ్మ చచ్చిపోయిం దని మా వదినెగా రబ్బాయి,గోడమీదుగా వచ్చి కేక వేసి చెప్పాడు. కర్మకాండలు చేయడానికి డబ్బులేదు. ఎప్పటికయినా నే వెళ్ళి కర్మచేయాలి. కాస్త డబ్బు ఇవ్వండి బాబూ.

జ: నువ్వెళ్ళకపోతే చచ్చినవాళ్ళను పారవేసేవాళ్ళు చాలా మందుంటారు. యివ్వాళ కొంచెము ఆఫీసర్లొస్తారు. నువ్విప్పు డుండితీరాలి.

గొ: అవును బాబయ్యా! మీ వంటి ధనవంతుల ఇండ్లలో నయితే పిలవకపోయినా, అర్థరాత్రి అమావాశ్య చీకట యిన, ఓపికున్నా లేకున్నా ఘరానా కొరకు గుంపులు గుంపులుగా వచ్చి కర్మకాండలు పూర్తిచేస్తారు. బీదలకు దిక్కెవరు?

జ: అయితే మా యింట్లో ఎవరిని చావమంటా?

గో: అంతకోపమెందుకు బాబూ. ఆనోజొస్తే ఎవ్వరు ఆప లేరు.

గో: జ: అదిగో బూట్లచప్పుడు వినబడుతోంది. కారుహారను కూడా మ్రోగుతుంది.

జ: అరెగోతాం మన సురేంద్రకాదుగదా.

గో: నాకు అట్లాగేఉంది. సూత్తానాగయ్యా (తిరిగొచ్చి) అవునయ్యా అవును. మన దొరగోరే సురేంద్రగారే. అరుగో వస్తున్నారు రాండయ్యా రండి. కూర్చోండి.

జమి: ఏరా సురేంద్రా పరీక్షలెలా రాశావురా.

సురేంద్ర: దానికేంగాని వాన్నా ఎవ్వరాతడు అడావుడిగా పోతున్నాడు.

గో: వాడొక పకీరుగోడులే.

జ: ఆ అయ్యోమయ్యంగాడు...... వాడి దెందుకులే.

సు: ఇంతకి ఎవరునాన్నా?

గో: కవట... చవట... కవి.

సు: అయితే.

జ: ఆ... ఏముంది ఉద్యోగం కావాలట. తిండిలేదట తిన టానికి. భార్యాభర్తలము చస్తున్నాము ఏమయినా...

గో: ఆ... చక్కర్ పొంగలట.

సు: ఆగరా...

జ: ఏమీలేదు నోరుముయ్యి అన్నాను. అంతే.

సు: అంతే... నిజమే... బీదవాళ్ళకు బ్రతుకే కష్టమని నీ కర్థంకాదులే. ఆతని కన్నీరుచూస్తే నా గుండె కరిగి పోయింది.

జ: బీదవాడా ... అయితే ...

సు: ఈ లోకంలో పేదవాళ్ళుకూడా వున్నారా? అంతా స్వార్థపరులే నంటావా? నేను మనస్ఫూర్తిగా చెబుతున్నాను. నాన్నా ... ధనవంతులమన్న ఊహ నా మనసులో కలిగితే చాలు. నే నెలా మారిపోతానో నా కర్థం కావడంలేదు. ఇంతమంది దరిద్రులలో ధనవంతుడు కావడం పచ్చి స్వార్థమనిపిస్తుంది. మన తోటిమానవులే తిండిలేక బాధలుపడుతూంటే ఒకోసారి నామీద నాకు అసహ్యం కలుగుతుంది. మనం రోజుకు నాల్గుసార్లు వేతి రొట్టెలూ, పాలూ, కమలాలు అన్నీ ఉడాయిస్తున్నామే నూటికి తొంభై మంది ఈ పదార్థాలు కళ్ళజూడనివాళ్ళు కూడా యున్నారు యింతకూ మన కేంకొమ్ములు మొలిచాయి చెప్పు? ... ...

జ: నీ కేం తెలుసురా. ఎవడో చెప్పిన నాల్గు మాటలు బట్టీ వేశావ్. "మెరుగులున్నప్పుడే ప్రజల్ని దోచుకోవాలి." తెలుసా.

సు: అయితే బీదవాళ్ళకు బ్రతికే రోజులే లేవా?

జ: ఎందుకురా బీదలు. దేశానికి దరిద్రం. పులి పాలిట మేక పిల్లలాగా. ఇంత పిరికా ... ...?

డు: నాకు పిరికిగాదు. 'ధనంకారంతో ప్రజలపై నీ కున్న పరాకు. ఈ ఆస్తంతా ఎక్కడిది? ఎవడబ్బసొమ్మిది? ఇదంతా నువ్వు చెమటోడ్చి సంపాదించావా? పేదల రక్తాన్ని విరజిమ్మిన భూసారం. అది మరచిన నీ లాంటి ధన మదాంధుల • కేమర్థమవుతుంది. ప్రజా నాయకుడిలా

M. L A.గా నిలబడుతున్నాను. ప్రచారానికి రమ్మని లెటరు వ్రాశావే! ఏమని ప్రచారంచేయాలి. మేము స్వార్థపరులమనా? లేక ధన మధాంధులమనా? మీాకు ఓట్లెలా యిస్తారు? మన మేడలు చూచా? మన జాగీరులు చూచా? మన మొఖాలుచూచా? నీ లాంటి స్వార్థపరులు M·L. A. లైతే స్వార్థంతో పట్టణాలే మరుబేరం చేస్తారు. M. L. A.అట. నిలబడతాడట. రోజులు మారాయి. యిది మూగప్రపంచంగాదు. లంచాలకు మంచాలు వేయడానికి. లోకం కన్ను తెరచింది.

జ: మనకి కావలసినంత డబ్బువుంది. మనకేం ప్రచారం. చేయడానికి కావలసినంత జనముంది. మనకేం కరువ.

సు: ఏమని ప్రచారం?

జ: ఏమనా...'ఈ నవభారత మహోత్కృష్ణ కార్యసాధనలో మనమంతా భాగస్వాములమని.

సు: మనమందరము భాగస్వాములమా? లేక భూ స్వాములమా? అదుగో చూడు ఇటే వస్తున్నాడు. గంజికి గతి లేక ఏలా పాకులాడుతున్నారో పక్కసారి చూడు?

బిచ్చగాడు (పాట)

ఓ...దయూలేద బీదలపైనా
కనికర మది వలదా
దేవుని సృష్టిలో అందరువకటే
ఎందుకుబాబూ హెచ్చుతగ్గులూ...లోకంలో...
మేడలో ఆడిపాడే మహారాజులైనా
పూరిగుడిసెలో బ్రతుకు బికారిమైనా

మెతుకులదారే బాబూ
అతుకుల జీవితమంతా ॥ద॥
తొలిచూపులోనే బికారియా
మలిచూపులోనే మహారాజుయా
కాలమెంత మారిపోయె స్వార్థంతో...
రాధను రమ్మన్నాడూ
ప్రభువే స్వయనుగ పిలిపించాడు.
కలిమితో ఎందరో కులుకుతు వున్నా
లేమితో నెందరో ఏడుస్తున్నా
ఓర్వలేక తన తీర్థంతో
లోకాన్నే మార్చాలని చూస్తున్నాడు ॥ద॥
కడసారి చూడరా......కన్నీటిధారా......

(పరిచారానికని బయలుదేరుతాడు పాటవింటూనే)

భిక్షుకుడు: బాబు...ధర్మం చెయ్యిబాబు.

జ: పోరాపో... నేను శుభమాయంటూ పోతూంటే నువ్వే ఎదురువచ్చావా?

భిక్షు: అంతకోపమెందుకు నాయనా. కూటికిలేని పేదవాళ్ళ పయిన... మేమేం చేశాము నాయనా.

జ: ఛీ... ఎన్నికరువులొచ్చినా యీ బీదవాళ్లు చచ్చేది కనబడ్డంలేదు.

భిక్షు: ఎందుకునాయనా... మేమేం పాపము చేసాము?

సు: యీ బీదవాళ్ళందరూ నశిస్తే తింటాడు యీయన... మట్టిగడ్డలు. ముళ్ళతుప్పలు. చదలపుట్టలు.

జ: ఆ తల్లకిందులంతా యీళ్ళే చేస్తున్నారంటావా?

సు: అంటముగాదు. కళ్ళుతెరిస్తే కనబడుతుంది. ఆలోచిస్తే తప్పు తెలుస్తుంది. (తండ్రివైపుజూపి) అరుగోచూడు ఎట్టిటి ఎండలో ఒడలుమరచి. పనిచేస్తున్నారు. మాన రక్షణకై మూరెడుగుడ్డ మొలనచుట్టి మెట్టపల్లాలేకము న్నకై బండచాకిరి చేస్తున్నారు. తిండికి గతిలేక, ఉంటా నికి యిల్లులేక చెట్లు, పుట్లుబట్టి కాలంగడుపుతూ పూటకు కాసిని గంజైనలేక మంచినీళ్ళతో ప్రాణాలు నిల్పుకొని. నీకంత బాధ్యతగా యెందుకు చెయ్యాలి?

జ: తిండిలేక ...

సు: అవును. బాధ్యతగాచేసేవారు చేసినదానికి ఫలితం పెట్ట మని అడిగే హక్కుకూడా లేకుండా జేస్తున్నారు. బాధ్యత యున్నవారికి హక్కుకూడా యుండాలని అర్థం జేసుకోలేవా? యిలా పండుముదుసలిని, జీవముడికిన దేహంతో భార్యాపిల్లల్ని పోషించుకోలేని పరిస్థితిలో వారిని పోషించలేని యీఅసమర్థత దేశం, యీ స్వార్థపు సంఘం, దున్నేవాడికిభూమి దక్కించలేకపోయిన, బాధ్య తయున్నవారికి హక్కు చూపించకపోయినా, చేసిన కష్టా నికి ఫలిత మివ్వలేకపోయినా, నిరుద్యోగసమస్యను హాని రించకపోయినా, లంచగొండితనాన్ని అణగద్రొక్కలేక యున్నా యెటూ దిక్కులేక జీవనానికి దారిలేక వచ్చిన యీ భిక్షుకులపైనా నీ దౌర్జన్యం ప్రజలలో నిరుద్యోగము ఉద్యోగులలో లంచగొండితనము, ఉన్నతాధికారులలో సోమరితనము ప్రబలిపోయినా సమర్థించలేని నీకుసయి తము గద్దెపై హకుకావాలి.

భిక్షు: (నవ్వుతాడు)

జ: (కోపంగా) పోరా దున్నపోతా... నిర్మలమైన కాపురంలో చిచ్చురేపావ్. నువ్వు ఇవ్వాళే రావాలి...పోయి ఏ నూతిలోనో పడి చావరాదు...ఇంకా నిలబడ్డావే పో (అంటూ అవతలకితోస్తాడు.) (భిక్షుకుడుక్రిందపడి వెర్రిగా చూస్తుంటాడు.)

సు: ఆగు...... యిలాంటి వారందరిని ఇష్టమొచ్చినట్లు ప్రాణాలుతీసి ఓట్లడిగే దెవ్వరిని. ఏలేదెవ్వరిని.

గో: సాసానం... ఎదురుచెప్పేవా డుండడుగా.

సు: ప్రజాహృదయాన్నర్థం చేసుకోలేని నువ్వుకూడ ఒక ప్రజానాయకుడవేనా? అందుకనే ప్రజల్లో నిరుద్యోగము. వుద్యోగులలో లంచగొండితనము వున్నతాధికారులలో సోమరితనమూ ప్రబలిపోతునాయి. తోటిమానవుల హృదయాన్నర్థం చేసుకోలేని నీది మానవహృదయా? లేక పాషాణహృదయమా? ప్రజలశ్రేయస్సుకోరని నీవు ప్రజానాయకుడుగావస్తే నీకు ఓట్లుగాదువచ్చేది చీవాట్లు రాజధానికి మార్గం తెలియదు నువ్వుఒక రాజకీయ నాయకుడవేనా?

జ: సురేంద్రా (కోపంగా)

సు: ప్రజలపై నాకున్న ప్రేమ,

భిక్షు: ఉదారగుణము నాయినా.

జ: సురేంద్రా నీ చంచలమైన ప్రేమతో స్థిరమైన కీర్తిని నాశనంచేస్తున్నావు. (అంటూ వెళ్ళిపోతాడు.)

సు: అసలు సూనకున్నది యీనాడుపోతున్నది. లే తాతా...

దెబ్బతగిలిందా. బీదవాళ్ళకు భూములు వచ్చేరోజులు వస్తున్నాయి. వున్నదంతా బీదలదే.

భిక్షు: యింకెంతకాలం నాయనా.

సు: దగ్గరకేవచ్చింది. రోజులు మారిపోయాయి. ప్రజలలో చైతన్యం గల్గింది. ప్రజాఉద్యమం కన్ను తెరచింది.

భిక్షు: నీ మేలు మరచిపోను నాయనా.

సు: మరువబోకు. తాతా... ధనికులంతా బీదవాళ్ళ కాళ్ళు దగ్గరకొచ్చే రోజులొస్తున్నాయి. ప్రజాశక్తి నాపలేరు.

భిక్షు: (వెళ్ళుతుంటాడు. సురేంద్ర రెండవవైపు వెళ్తాడు. గోతాంకూడ వెళ్ళును.) (తెర వెనుక పాట)

ప్రతికే రాతేలేదా
బీదలకిక నిలచేనీడే లేదా ॥ప్రతి॥

పెద్దలమాట పెడచెవిబెట్టి
మహాత్ములెందరో మంటలోగలిసి
స్వేచ్ఛగనిల్పిన యీ స్వార్థపురాజ్యంలో
ప్రతికే రాతేలేదా.
కనీసం— దేహియనే హక్కేలేదా

చేసేదంతా ప్రజలకోసమే!
రాసేదంతా జగతికోసమే!!
మేం నిలచేదంతా మీకోసమే!!!
యనివులికించే ప్రజానాయకుల రాజ్యంలో
యీ రామరాజ్యంలో... ప్రతికే రాతేలేదా
బీదలకీజగతిలో అశేలేదా
లేదికపోగా. పో... పోరా... పోరా...

# మూడవ రంగము

[రంగస్థలము]

[పంకజ విచారిస్తూ ఒక్కతే తుఫానుకు విరిగిపోయిన పూల పందిరను సరిచేస్తూ ఉంటుంది. సామాన్య కుటుంబమే]

పంకజ: (పాట)

రారా మదనా నే వంటరిదాననురా
మాసీ మాయని పూవునురా
మదనా నా ముద్దుల మదనా
ఒకసారిటు నా చెంత జేరగ రారా ॥రారా॥
అడవిన గాచిన వెన్నెలగా
పూచీ పూయని గులాబిరా
నవ్వు శృంగారం నడక వయ్యారం
అందచందాలన్నీ నీ పరమేరా
రారా ఇటు మదనా
పూలపాన్పుపై పవ్వళింపగా
యెవ్వరులే రిటు మదనా ॥రారా॥
రాత్రింబవళ్ళు తరబడి పోవగ
ముసురు వానలతో మబ్బులుపట్టగా
బోడి పొదలే చిగురు దొడగెరా
రారా నిటు మదనా... ॥పూలపాన్పుపై॥

సుం: (ప్రవేశిస్తూ) అందెమె ఆనందం
ఆనందమె జీవిత మకరందం.

పం: (పులిక్కిపడి వెర్రిగా చూస్తుంది:)

సుం: పంకజా బాగున్నావా (నవ్వుతూ)

పం: ఆ......ఇచ్చినదేవుడు మర్చిపోనంతకాలం బాగానే వున్నాం.

సుం: పాపం...మల్లిపందెర రాత్రి గాలికి విరిగి పడిపోయింది గాబోలు,

పం: సరేలే...యిలావచ్చావే?

సుం: ఏదో నిన్ను చూచిపోదామని.

పం: చూడడమయిందిగా నాన్న చచ్చిన ఆరుమాసాలకు.

సుం: (కొంచెం ముందుకొచ్చి) నే సాయపడతా నీ విరిగిన పందెర నే సరిజేస్తా.

పం: యీ చిన్నవిషయానికి మీ సహాయ మనవసరం...

సుం: జోడూ—తోడూ లేని పని కష్టం.

పం: లేనివా రేంచేస్తారు?

సుం: తోడు కల్పించుకొని స్వశక్తితో పూర్తిచేసుకోవాలి. (పందెర సరిచేస్తూ)

యీ పుష్పం ఎరుగక నిన్నాశ్రయించింది.

పం: ఏం?

సుం: నీచెంతనుండుటచే దానివిలువ నశించింది.

పం: మాటలు టూకీగా వదిలేస్తున్నావే.

సుం: అదృష్టవశాత్తు నిన్నుచూచి అన్యమనస్కుడనై కొన్ని మాటలు మరచా.

పం: మర్యాదగా మాట్లాడ్డం నేర్చుకోవాలి.

సుం: నేనేం తప్పుమాట్లాడాను అయినా మనదేశం క్రొత్త కాదుగదా?

పం: ఆనాడే తీరిపోయింది.

సుం: అయినా నువ్వెంతకాలం యీ కాఠిన్యజీవితం గడుపు తావ్.

పం: అవసరం కల్గినంతవరకు.

సుం: ఆ మృత్యుదేవత పచ్చని తోరణాలు పందెరన వ్రేలాడకుండానే తండ్రిని పొట్టబెట్టుకుంది.

పం: నే కట్టుకొంటూ నీకాలస్యమవుతుంరి.

సుం: చేసేపనేముంది.

పం: నా పందిరినిగురించి చాల శ్రమపడ్డావు.

సుం: ఈమాత్రాన శ్రమయేముంది?

(చప్పరిస్తాడు)

పం: దాహంతో బాధపడుతున్నావా?

సుం: లేదు. చాలా రోజులనుండి బాధపడుతూనే యున్నా కాని దాహాన్ని. తీర్చే నీ లాంటి సామర్థ్యాలు నిరసన జూపి మరింత తాపాన్నభివృద్ధి జేస్తున్నారు.

పం: దాహం పుచ్చుకో నీ తాపం చల్లారుతుంది.

సుం; ఆనందంతో అందిస్తే పుచ్చుకోని వారెవరుంటారు.

పం: కొందరు భయపడతారు. హృదయాన్నర్థంచేసుకోలేక!

సుం: సురేంద్ర యీ మధ్య రావడంలేదా?

పం: వస్తే తప్పా?

సుం: తప్పని కాదు. ఎప్పుడూ రావటం అలవాటుగా (అంటూ వికసించిన పూవుతుంపుతాడు.)

పం: బంధుత్వంతో రావటం పరిపాటు.

సుం: అవును. నిజమే. ఏదో బంధుత్వమున్నది గాబట్టే (అసూయగా చూస్తాడు) అయినా ఏం బంధుత్వం.

పం: మాదా మానసిక బంధుత్వం.

సుం: శారీరక బంధుత్వాన్ని మరచిపోవద్దు.

పం: లోకం ఎరుగనివాళ్ళకు ఎత్తులు మప్పుతుంది.

సుం: ఔను. ఎరుగని అమాయకులను ప్రేమపాశములతో బంధిస్తుంది.

పం: కొందరకు విజ్ఞానం శూన్యమై వెర్రివూహాలతో లోకం నడుగిడతారు.

సుం: పంకజా ... నా హృదయంలో వుద్రేకం కల్గించకు.

పం: సుందరం ... నిన్నే ... నీకేమయినా మతిపోయిందా?

సుం: కాదు నీ సౌందర్య మిలా వ్యర్థమవుతున్నదని విచారిస్తున్నా.

పం: పాపం. చాలా శ్రమపడుతున్నావు.

సుం: నీ గులాబీ బుగ్గలు మసివారాయే.

పం: అలానా!

సుం: నీ మృదువైన శరీరం బిగి ముడతలు వారి హేళన చేస్తూంది.

పం: ఆ! ... దానికి మతిపోయిందిలే.

సుం: నీ యౌవ్వనము అడవిగాచిన వెన్నెల.

పం: అధికప్రసంగం చేయకు.

సుం: నేను నీ శ్రేయస్సుగోరి చెబుతున్నా.

పం: (విచారిస్తూ) ఏనాడైతే తండ్రిదూరమయ్యాడో ఆనాడే ఆశనశించింది.

సుం: నేనున్నానుగా... అయినా... విశాలజీవితాన్నిలా వ్యర్థం చేయవలసిందే?

పం: నాశనమవక ఏమవుతుంది.

సుం: ప్రతివ్యక్తికి వాంఛ బలమైనకొద్దీ మనస్సులు స్వాధీన తప్పతాయి.

పం: ఏ కొందరికోతప్ప

సుం: నీ ప్రతివాక్కు నా రక్త నాళాల్లో రక్తాన్ని, నాహృదయాన్ని 'భగ్ భగ్'మని మండింప జేస్తోంది. నీధర్మం నీవు నిర్వర్తించుకొన్నావు. నీ తప్పేముంది.

పం: ఇప్పటికే ఊరంతా నీతినియమంలేకుండా లేనిపోని ఘోష బయలుదేర తీసారు.

సుం: అంతకన్నా ప్రభుద్ధులు లేకపోలేదు.

పం: అవును తన గుట్టును బెట్టుగాయుంచుకోవడానికేయితరులను ఎత్తిపొడుస్తుంటారు.

సుం: అంతరార్థం......?

పం: సురేంద్రతో......

సుం: సందేహామేమిటి......?

పం: తప్పుడుకూతలు కట్టిపెట్టు.

సుం: అది వట్టి పుకారే.

పం: ఔను పుకారును లేవదీసింది మీరు.

సుం: మేమా (కంగారుగా)

పం: ఆ నటనలెందుకు...చాటుగా కాఫీలు ఉప్మాలు అన్నీ అంటుకుతినేదెవ్వరు. తక్కువ కులంవారితో ఛీ, ఛీ యనుపించుకొని మానవత్వం నశించి దాన్ని దాచటానికి

మాటువేసి వుద్యోగానికని ఊళ్ళవెంట తిరిగిన దెవ్వరు? అంతా నాదే నని ఆశచెంది కాలేజీలనుంచి ఉత్తరాలు వ్రాసి ఫలితం దక్కక ఏడ్చిందెవ్వరు? మెత్తగా మాట లన్నా పడటానికి దొరికింది మేమూ...నిజంగా మీరు ఒక మానవులేనా? లేక మీ మానసిక బుద్ధేమైనా మందగించిందా? యిప్పటికైనా యెదుటివారిని హేళన జేయటం మానమంటాను.

సుం: విషయం తటస్థపడనిది వారెలా రుజుపరుస్తారు?

పం: వారికి మంచీచెడులూ లేవు. స్త్రీపురుషినితో పురుషుడు స్త్రీతో చనువుమీర స్నేహాన్ని అభిలషిస్తే తెచ్చిపెట్టిన కళంకధారమిది.

సుం: అంతటి అవివేకు లుంటారా?

పం: తప్పక.

సుం: నీ సౌందర్యాన్ని దాచుకొంటున్నావు.

పం: నే దాచవలసిన అవసరంలేదు. నా చెంతజేరి అదే ఖేదపడుతూంది.

సుం: వికసించిన పూవు సేవ సౌరభ్యాన్ని దాచలేదు.

పం: అదృష్టవంతులకు ఆ ఘ్రాణించు భాగ్యం లభిస్తుంది.

సుం: నిజమే.

పం: అడవిలో పూచిన పువ్వు... సౌరభ్యాన్ని వెదజల్లి అడ వికే ఆనందం కల్గిస్తుంది.

సుం: చివరకు అది అడవికే ఆహుతవుతుంది.

పం: అడ్డప్రశ్నలు వేస్తున్నావే.

సుం: ఇది ప్రకృతి కల్పన.

పం: ఇది మానవ కల్పన—ఎదుటివారి మనసు అర్థం చేసుకోలేక చులకనగా చూచుట.

సుం: నేను నిన్నొక విషయం అడగదలచొచ్చా.

పం: దానికేం సాధ్యపడితే......

సుం: చిరకాలంనుండి నీ స్నేహాక వాంఛిస్తున్నా.

పం: ఎలా సాధ్యం?

సుం: మలినపడ్డ హృదయాన్ని మరమ్మతు చేసుకొని.

పం: వీలుపడదు.

సుం: నీ సౌందర్యాన్ని నిరంతరమూ తలచుకొని.

పం: మనస్సు కట్టుబాటు లేక.

సుం: చేరదీసిన ప్రియుణ్ణయినా సంబంధం లేనట్లు సంచరించగలదు స్త్రీజాతి. కాని మా కా పని సాధ్యముగాదు.

పం: కాస్త ముందు వెనుకలు చూడు.

సుం: ఆలోచించే యీ పనికి పూనుకొన్నా.

పం: బుద్ధి హీనులకే దుర్నడతలు–దుచ్చేష్టలు.

సుం పంకజా ఆలోచించుకో. నా అంతరాత్మను అర్థం చేసుకో. నీ హృదయంలో నాకు చోటివ్వు.

పం: (నిరసనగా) ఇచ్చటనుండి వెళ్లాలి మర్యాదగా......

సుం: పంకజా. ఆడవాళ్ళకు ఆలోచన తక్కువ. ఆవేశా లెక్కువనీ అంతరాత్మ అనిపిస్తోందేమో......కాని... నీ నుండి వేరగుట కష్టము.

పం: యోగ్యుడవని యింతవరకూ గౌరవించాను ఆమర్యాద కూడా పోయింది.

సుం: యిందాకా వచ్చిందా. ఫజిల్లో లక్షరూపాయల లాటరీ కొట్టేప్పటికి.

పం: అవి రాబట్టేగా......

సుం:యీ విశాలప్రపంచములో ఎవరెన్ని పనులు చేసినా... ఎవరెంత కష్టపడ్డా... ఎవరెంత మోసంచేసినా డబ్బు కొఱకే...కోటివిద్యలు కూటికొఱకె...

(అంతరాత్మ బిగ్గరగా)

సుం: ...నీచుడా... మతేమైనా పోయిందా... ఆశకు పాకులాడి ప్రేమకు పాశుడవై ధనంకారముతో కుమిలి పోతున్న పంకజకు దాసుడవై ప్రపంచానికే అనుమతిలేని యభాగ్యుడవై ఆర్థిక స్వతంత్రములేక బానిసగా బ్రతుకు తూన్న ఆడదాని ఆడంబరాన్నర్థం చేసుకోలేని నిర్భా గ్యుడవై కుమిలి పోతున్నావా? మానుతిరిగి నీజీవితాన్ని మరమ్మతు చేసుకో......

సుం: ఛీ నిన్నెవరడిగారు. పిలవని పేరంటానికి బయలు దేరావు.

పంకజా... నీ సౌందర్యానికి ముగ్ధుడనై నిరీక్షిస్తున్నా

పం: అదినీకు సాధ్యపడదని ఒకసారి కొకసారి చెబుతున్నా.

సుం: స్త్రీబుద్ధి ప్రళయాంతకమని ఋజుపరుస్తున్నావు.

పం: ఇక నా విశ్వాసానికి కంటక మనిపిస్తున్నావు.

సుం: నామాటలకు విలువ లేదనుకొంటున్నావా?

పం: కాదు. పెద్దమనుష్యుల పేరున జరిగేదుర్నీతి అర్థంచేసు కొంటున్నా.

సుం: అనుమానించి అవమాన పరుస్తున్నావా?

పం: కాదు కటువైన నీమోటుప్రవర్తనను పరిచేసుకోమని చెప్తున్నా.

సుం: నాలో దోబూచులాడుతూన్న ఆశను బయటపరచినందు కెందుకింత ఆగ్రహం?

పం: ఆగ్రహంకాదు. నలుగురిలోపెట్టి గడ్డితినిపిస్తే...

సుం: పంకజా! యిది పరిస్థితుల ప్రాభల్యమా లేక నీమానసిక దార్భల్యమా?... ...జాగ్రత్త! ఒడులు తెలుసుకొని మాట్లాడు. నే నెవరినో తెలుసా?

పం: ఓ! తెలియకేం?

సుం: ఈ సుందరాన్ని బెదిరింపనంచావా? ఈ ప్రదేశంలో నువ్వొక్క క్షణముండలేవు. చూస్తావుగా నా ప్రతాపం.

పం: నీ ప్రతాప మిప్పుడు బయటపడింది.

సుం: నీ గౌరవజీవితం ఇంతవరకూ గుట్టుగానుంచాను. ఇకపై నీ జీవిత మెలా పరిణమిస్తుందో నీకే అర్థంకాదు. నీ సత్యశీలత యెవరికి తెలియనిదికాదు. అయినా నువ్వొక అబలవు.

పం: స్త్రీయంటే మీ దృష్టిలో అంత తేలిగ్గా కనబతుతోందేమో... ...

సుం: కాక ...

పం: స్త్రీయంటే పిల్లల్ని కనే యంత్రమూగాదు ఆనందంతో చెలగాటమాడే విలాసవస్తువూగాదు.

సుం: కాదులే... వంటి గదిలో వంటమనిషిలో.

పం: ఈ ఉన్నతమైన విశాలదేశంలో పుట్టి నేర్చుకొన్నది దేనా?
ఆడదియంటే ఆదిమాత.

సుం: కాదు ఆడదియంటే ప్రేతాళ భూతం.

పం: ఛీ! నన్ను విడువవ్... రాక్షసి... మలినపడ్డ నీ హృదయార్భాటంతో నా జీవితాన్ని భంగపరచకు.

సుం: నీచురాలా... నీవనవలసినమాట యిదేనా?

పం: మాన ధనుడవని ఒంటరిగా మనసిచ్చి మాట్లాడినందుకా?

సుం: నీ మధురవాక్కు విని నా హృదయ యార్భాటాన్నణచుకొని పరిపూర్ణానందాన్ని పొందుదామని.

పం: నీవు నా ఆనందాన్ని మంటగలపదలచావు.

సుం: ఆశించినవారిని మోసంచేయడం మీ ఆడవాళ్ళకు అలవాటేగా.

పం: నీ ఈర్ష్యాగుణం పట్టుబడింది... 'బికారీ'......అవతలకు వెళ్ళు.

సుం: కృతఘ్నురాలా! తండ్రిచచ్చినా పండువంటి కుర్రాన్ని నీపాల భంగపరుస్తున్నావ్. అవును పరాకుతోయున్నవారి కందరూ 'బికారీ' లాగానే కనబడుతారు.

పం: అనవసరంగా మాట్లాడకు. To Much is Nonsence

సుం: Sorry అనాలా...... ఎప్పటికయినా సుందరం నీవాడని అర్థంచేసుకో.

పం: ఛీ మాట్లాడకుపో.

సుం: నీ బతుకూ, నీగర్వం, నే లాంగదీస్తా. ఏనాటికైన యీ సుందరం పాదాలే నీకు పూలపాన్పులు.

పం: ఏడిశావ్... అవతలికిపో. ఎవరన్నావింటే నగుబాటు.
సుం: ఆడవాళ్ళకు ఆర్భాటాలెక్కువ. ఆలోచన తక్కువ...
పంకజా. పేరు నిలయం ఫలం.... శూన్యం... పంకజా.
ఏదీ ఒక్కసారి బావా అను.
పం: బావ... నీచుడా... పో అవతలికిపో.
సుం: సరే వెళ్ళుతున్నా... యీ సుందరం ఎన్నటికీ మరిచిపోడు. నా జీవితానికి ఒక తీరని మచ్చవేశావ్. అయినా.

కాదంటే... అవుననిలే
అవునంటే... కాదనిలే
ఆడవారి మాటలకు అర్థాలే వేరులే
అర్థాలె వేరులే.

(తెర)

# నాలుగవ రంగము

(సుందరం పాట పాడుకొంటూ యొస్తాడు)

ఒడుల గతులను జూడరా
విలువమాత్రము గొప్పరా
చదువు యచట సున్నరా
ఏమిరాదు యిదిమేటన్న
నీ ఖర్మయని యంటారురా.
నీకు నాకు లేనిహక్కు వాడి
కెవడిచ్చాడురా.

అడవిమృగములు చూడరా
కడుపునిండితె తినవురా.
బిరుదువంది మనుషమృగములు యంతెరా
ప్రజలమాటే మరచురా.

సురేంద్ర: (ప్రవేశం) ఏరోయ్ సుందరం నవ్వంతాయివ్వాళే ఖర్చుచేస్తున్నావేమోయ్.
సుం: అనుకోని పని, తలంచని కార్యము జరిగినాయ్.
సు: యేమిటోయ్?
సుం: అదేదోలే (పారిపోబోతాడు)
సు: ఎందుకలా పారిపోతావ్?
సుం: నాకు భయమేస్తోంది.
సు: భయమా. ఎందుకు? నే నేం రాకుసినా?
సుం: మనుష్యులను చూస్తే భయమేస్తోంది.
సు: అబ్బబ్బ... చంపేస్తున్నావ్. అటు చావనీవు ఇటు బ్రతకనీవు.
సుం: చావా... అదంటే నాకు చాలా భయం, వెళ్ళిపోతా.
సు: నే నున్నానుగా... ఇదిగో... పాతస్నేహం మరిచిపోవద్దు.
సుం: ఇప్పు డేం చేస్తా.
సు: అసలు నీ కెందు కంతభయం. తోటిమానవులనుచూస్తే.
సుం: తోటి మానవులా. కాదు. సాటిలేని రాకాసిమూకలు.
సు: అబ్బబ్బ... యింతకీ ఏంజరిగింది?
సుం: నేను పిచ్చివాణ్నట. మనుషుల్లో పనికిరానట.
సు: పిచ్చివాడవా... నువ్వు పిచ్చివాడవా!
సుం: అవును.

సు: కాదు. కాదు. ఈ అధోగతి ప్రపంచంలో ......స్థిర స్థోమతలేని గాలిపటంలాంటి సంఘపుబాటలో...అడుగుజాడల నర్థంజేసుకోలేని యీ మానసికబుద్ధుల్లో...బీదవాడే పిచ్చివాడు... అదృష్టవంతుడు ధనంవల్ల తెలివిగలవాడౌతాడు... ధనమే యీ జగానికి మూలం... యీ రంగస్థలంలో డబ్బుకేగాని మానవునకు విలువ లేదు... శాస్త్రమూ చట్టమూ సమ్మతించితే దొంగే దొరగా మారిపోతాడు.

సుం: అయితే...

సు: అసలు సంగతేంటి?

సుం: అసలేంటి మళ్లాచివర.

సు: అదే...కారణం.

సుం: ఓహో అదా...

సు: ఊ...అదే.

సుం: నీది, నాదే.

సు: అదేమిత్రా.

సుం: అదిసాంతం మారిపోయిందిలే.

సు: సంగతి సరిగ్గా చెప్పు...ఏదిరా (ఆదుర్దాగా)

సుం: అదే...పంకజ...పూర్తిగా మారిపోయింది. అలా చూస్తావే?

సు: ఎప్పుడు?

సుం: ఒక పావుగంటక్రితం.

సు: అయితే ఏం జరిగింది?

సుం: ఇంకేం జరిగింది. నన్నే...

సు: హా... పంకజ నిన్ను ప్రేమిస్తోందా...?-ఛీ... అప్రాచీ... నాతో కపటనాటక మాడుతున్నావా. నా కంట పడక పోవు... నా చేత చిక్కకపోవు... ఆ తరువాత ఏమంది?

సుం: ఏమందేమిటి. "సురేంద్ర నెప్పుడూ ప్రేమించ లేదే. నా కాతని పరిచయమే" లేదన్నది.

సు: (నవ్వుతూ) అయితే అయిందిగానిబలేనాటకమాడిందిలే. అంతేనా.

సుం: అప్పుడే... వాడి ముఖమయినా నాకు తెలియదంది.

సు: నిజంగా?

సుం: నే నెన్నో గుర్తులు చెప్పా.

సు: ఏమంది?

సుం: ఇంకా ఆశవుందా? ...అయినా ఒకప్రక్క తిడుతూనే ఆ ప్రేమెందుకు?

సు: చిరునవ్వుమొగాన్ని పైకి తిడుతున్న మనస్సుమాత్రం ప్రేమిస్తూనేయుంటుంది. పంకజా... నా జీవితానికి నీవే సూర్యకాంతివి. నీవులేని దేశం కారుమబ్బులా వుంటుంది. నా హృదయంలో సదా నీ మందహాసాలేవర్షిస్తుంటాయి.

సుం: ఇది ప్రేమప్రతిపాదనా లేక వాతావరణ వివరణా?

సు: సరే నాకు టయిమయింది... ఇంకా ఏమంది?

సుం: అయినా గొప్ప చెప్పటం మానవ సహజమేగా... ... అయినా మానవులేమిటి? "చదలేటి బంగారు జలరుహం బులంతూడ్లు భోజనంబులు మాకు పువ్వుబోణి" అని అంది ఆనాడుహంస... తామరతూండ్లు మా కాహారమని చెప్పరాదు...

సు: అయితే అదృష్ట వంతుడవోయ్. సుందరం పంకజను స్వాధీనం జేసుకొన్నావు. యీ విశాల ప్రపంచంలో మీా కెవ్వరూ సాటిలేరు.

సుం: ఇంకా.

సు: సరే. ఎక్కడికి వెళుతున్నావో... కాస్త తోవతప్పిపో. (తనలో) వీడట పంకజను ప్రేమిస్తున్నాడట. ఛీ నీచు రాలా. ఏనాడైతే మనమిద్దరమూ ఒకరిముఖానొకరు చూచుకొని నవ్వుకొన్నామో. ఆనాడే సాటి సమూహ మంతా అక్షింతలు వేసారు... కాని నన్నుకాలదన్న టానికి ప్రయత్నిస్తున్నావా... లేక స్వేచ్ఛకు నేనాటంక మొచ్చునని విచారిస్తున్నావా.

బిచ్చగాడు: (వణుకుతూ ప్రవేశం)

సుం: (వెర్రిచూపులు)

బిచ్చ: అమ్మా... బాబూ... యీజీవికి దారెటూ లేదా... మృత్యువు తరుముతోందా... వద్దువద్దు నాకుప్రాణముపై తీపివుంది. అనే బ్రతకటమెలా... నన్నాదరించేదెవ్వరూ అయితే చావడమే మంచిది. ఉన్నవారికన్నా పుష్టిగా తిండిదొరుకుతుందేమో... వచ్చింది. దగ్గరకే వచ్చింది వళ్లంతా నీరవుతోంది. జగమంతా తారుమారు. యీ జగానికి పైకప్పు నాకంటిసీరు. సరే వెళ్తా... (వణుకుతు)

సుం: ఎవరునాయనా ఎందుకింత విచారంగా బాధపడు తున్నావ్.

బిచ్చ: ఎందుకుబాబూ శంఖానికి కీచుగోల.

సుం: ఇంతకీ నీకేం కష్టమొచ్చింది?

బిచ్చ: ఇంకేంకష్టంనాయనా. బ్రికుదెరువుకు పెనుగులాట

సుం: ఇంతమంది జమీందార్లు. పెద్దపెద్ద ఖాతాదార్లు ప్రపంచానికే ప్రఖ్యాతినందిన కోటీశ్వరులూవున్న ఈవిశాల భారతదేశంలో నీవక్కడిని పోషించే దయాహృదయం లేకపోయిందా.

బిచ్చ: పొరబడుతున్నావు నాయనా... ఉన్నదానిలో పెట్టినా లేకపోతే లేదనిచెప్పినా దయాహృదయమనేది బీదలకే అంకితము చేయబడింది. దయా జాలీ అంటూఉంటే కోటీశ్వరులెలా ఔతారు నాయనా.

సుం: ఇంతకూ నువ్వెవరవు?

బిచ్చ: నన్నెందుకడుగుతావ్ బాబు. చెప్పుకోటానికి సిగ్గు కూడా వేస్తూంది.

సుం: ఎందుకు సిగ్గు?

బిచ్చ: ఎందుకా...స్వతంత్రభారతదేశంలో పుట్టి పూట కూటికిలేని బీదవాణ్ణని చెప్పుకోటానికి... బాబూ నాకు రోజులు మూసుకుపోతున్నాయి. ...మాట్లాడించకు... యీ జగంలో సుఖంలేకపోయినా ప్రయాణంలోనన్నా మైమరచి ఈ జగాన్ని మర్చిపోతానేమో. (మూల్గుతూ) అమ్మా... అమ్మా.

జమీం: (ప్రవేశం)

సుం: ఇంతకూ నువ్వెవరవుబాబూ? నీ వాలకముచూస్తూంటే నా గుండె తరుక్కుపోతూంది.

బిచ్చ: ఇది ఇప్పుడడగబోకు నాయనా...గుప్పెడు మెతుకుల కోసం కడుపు చేతబట్టుకొని వలస వచ్చిన దరిద్రుణ్ణి.

జ: (వెర్రిచూపులు)

సుం: ఎందుకలా విచారపడతావ్. కష్టము అంటే బీద వాళ్ళకు పుట్టినిల్లేగా, చెప్పునాయనా;

బిచ్చ: అదంతా చెప్పటానికి భయంకూడా వేస్తూంది...... నేనూ ఒక సామాన్యపు రైతునే. గాలివానవల్ల నేను బకాయి చెల్లించుకోలేక పోయినాను. అందుకు పెద్ద లనుకున్న రైతులంతా ఆస్తిని స్వాధీనం చేసుకొన్నారు. కుటుంబాన్ని పోషించటం కష్టమయ్యేసరికి నా జానెడు పొట్టకు దోవెతుక్కుంటూ బయలుదేరాను. పెద్దకొడుకు చిన్నతనంలోనే అమ్మమ్మ ఆస్తికి దత్తత వెళ్ళాడు. కుటుంబమంతా నశించిపోయింది. యెక్కడికి పోతున్నానో తెలియకుంచానే ప్రయాణం సాగించాను. ఒకచోట ఎందుకో దిబ్బసైన్యమంతా గుంపులు గుంపులుగా యున్నారు. ఏమిటాయని నిలబడి చూస్తున్నాను. గల్లంతు బయలుదేరింది. అటూ, నిటూ తిరుగుతూ నన్నుపట్టుకొని గొలుసులు కట్టారు. ఏం చేయను...? యిదంతా యేమిటని అడిగితే 'నువ్వు దొరగారి మరచెంబు కాజేస్తావా యంటూ నానా హింసలు పెట్టారు. చివరికి అది వారు పోయిన క్యాంపులో మరచిపోయొచ్చారని మరోబంట్రోతు తెచ్చి యిచ్చాడు. సరే కేసులు దొరకని రోజుల్లో దొరికినివాని నెందు కొదిలిపెట్టాలా అని నీకు అయిదేండ్లు ఖయిదన్నారు. ఆ ఖయిదులో బాధలు పడలేక ఆ ఏకాంక జీవనం పట్టలేక యీ విశాల ప్రపంచంలో నా కొక్కడికి ఖాళీ దొర

కదా యని పారిపోయొచ్చాను...యిపుడు జీవనానికి బాధపడుతున్నాను.

సుం: పిచ్చివాడా సర్వమూ నీ స్వాధీనములోయున్న ఆ నాల్గు గోడలమధ్య స్థలాన్ని విడచి బెత్తెడు నేలైనా లేని యీ పెద్ద ఖైదీలో ఏం సుఖపడదా మనుకొన్నావయ్యా. ఈ ప్రపంచంలో యెవరిగోల వారిదే. యెవడు వెదికినా స్వార్థానికి మార్గం.

జ: (దగ్గరలో కొస్తాడు)

బిచ్చ: అయితే ప్రపంచంలో నాబాధ వినేవారే లేరా?

జ: ఆ... ఎవరైనా తీరిగ్గాఉంటేగా ఎదుటిబాధ నర్థంచేసుకోటానికి.

బిచ్చ: అంతేనా... నువ్వా జమిందార్.

సుం: అవును జమిందారుగారే. (వికటంగా)

బిచ్చ: (తనలో) తల్లిలేని కొడుకువు. తండ్రిలేని బిడ్డవు. ఎక్కడున్నానో. నువ్వాన్నా సుఖంగా నిలచి వంశానికి వన్నెతెచ్చి మలినపడ్డ సంఘాన్ని మరమ్మతు చేయరా...(దగ్గుతూ) అమ్మా...అమ్మా...అమ్మా... సుందరం...(చచ్చిపోతాడు.)

సుం: (చేతిపై పచ్చచూచి) శ్రీనివాస్. నాన్నా, నువ్వా నాన్నా...నాన్నా...

(తెరవెనుక పాట)

దైవమా! దైవమా
నీకయినా లేదటరా జాలీ
నిజాని కున్నావో లేవో.

లేకమేమే వెర్రిగ ప్రాధేయపడుచుంటిమో
నీవును స్వార్థముతో మునిగియుంటివో
సాగకయున్న
పంపరాదటయ్యా నీరాజీనామ పత్రం
వేయితలలెందుకు నినుగొల్వ
మా హృదయమందొకసారి
తప్పని యెన్నుకొందుము
మా ప్రకృతి సాక్షిగా?

సుం: నాన్నా పుట్టిన ప్రతి జీవి ప్రపంచానికి పనికొస్తాడని లోక మాసిస్తోన్న బీదపాట్టతో చావవలసినవసరమొస్తోంటే... నాన్నా ప్రజలసౌభాగ్యమే జీవితలక్ష్యంగా యెంచే నీవు ఒక మానవుడుగాజన్మించాలి. అడుగెటు వేయాలో, మాటెలా మాట్లాడాలో తెలియనివాడివి నీ మోసపు ప్రపంచంలో కెందుకొచ్చావు నాన్నా?

జమిం: శాంతించునాయనా. పోయినవాళ్ళు తిరిగిరారుగా. నేనూ విచారపడుతున్నా నా కళ్ళముందు ఒక ఓటు పోయిందని. శాంతించు. ఏడిస్తే లాభమేముంది?

సుం: శాంతీ... శాంతీ... శాంతి... ఏమిశాంతీ?

జమిం: పెద్దలమాటనుసరించాలయ్యా.

సుం: తింటానికి తిండిలేక కడుపుచేతపట్టుకొని వలసపోతోన్న కట్టుగుడ్డలులేక మానరక్షణాకై మూరెడు గుడ్డ మొలకు చుట్టి బండచాకిరి చేస్తూన్న విద్యనభ్యసించటానికి డబ్బు లేక విరామమే సమాధిగా యెంచుకొంటూన్న శాంతీ శాంతీ యంటూ శాంతికపోతుల పేరుతో రాంబందు

ల్లాగా పర్జలను పీక్కుతినే శాంతికపోతాలతోనే అనుస రిస్తాం. ప్రజాఘోష తీర్చలేక, ఉన్నచోట తౌడు చేటలు కుక్కలకలవరంగా మానవ హృదయాలు దగ్ధమై పోతూంటే దాని నరికట్టలేక బైటకుపోయి, శాంతీ, శాంతీ యంటానికి సిగ్గుండొద్దూ.

జమిం: అవన్నీ ఎందుకునాయనా. నా పని నేను చెపుతున్నా. నేను వచ్చే ఎన్నికల్లో M. L. A. గా నిలబడుతున్నా. కాబట్టి ఒటు యిస్తారని...

సుం: నిన్నెన్నుకొంటే యేంచేస్తావు? నీకేం తెలుసనీ!

జమిం: తెలిసికొని వాటినన్నీ తిరగెయ్యటానికేగదయ్యా మిమ్మల్ని యెన్నుకోమనేది.

సుం: రాజధానికి దారితెలియను. నీకుగూడా గద్దెపై హక్కు కావాలి.

జమిం: అదంతాయెందుకు? జాతి మత రహితమైన ప్రజా స్వామ్య ప్రజారాజ్యాన్ని స్థాపించటమే మా ఆశయ మంటే నమ్మండి.

సుం: ఎవరిసొమ్ముంది పంచుకు తినడానికి? చూడవయ్యా ప్రజారాజ్యమని డబ్బాకొట్టునే యీ స్వతంత్ర దేశంలో ఎంతమందున్నారో తిండిలేక చచ్చిపోయేవాళ్ళు. ఓటు అడిగావుగాని పోవయ్యా. కాతాలు తల్లకిందులయ్యాయి.

జ: ఇదిగో డబ్బు?

సుం: డబ్బు...డబ్బట మేమెంత బీదలమయిన మానవత్వా న్నముకొనే మృగాలము కాదయ్యా... యిదేమైనా వడ్డీ వ్యాపార మనుకున్నావా...? తిండిలేక యెంతమంది

ప్రాణాలు ధారపోస్తున్నా. అంతఃపురంలోవుండే మీ కేమి తెలుస్తుంది. తండ్రిపోయి నేనేడుస్తోంటే స్వార్థంకోసం నువ్వు పెనుగులాడు తున్నావంటే .. నిజంగా నీదిమానవ హృదయమా లేక పాషాణహృదయమా.

జ: ఊ— ఇలాగైనా బ్రతుకుతున్నారు. ప్రాణంపోయిన వాళ్ళుచచ్చినా. ప్రాణమున్న వాళ్ళనా బ్రతుకు తున్నారు. అదికూడా ఉండదు.

సుం: ఇంకేం చేస్తాం. బంజరుభూములన్నీ ఇపుడు సాగుచేస్తు న్నావు. ఇక స్మశానాలు సాగుచేస్తావు అంతేనా! ప్రపం చానికే శృంఖాలు వేసేవాడివి యిది నీకోక పెద్దపనా. పోవయ్యా యిదేమీ వడ్డీవ్యాపారంకాదు.

(జమిందారు వెడలిపోవును)

నాన్నా—వింటున్నావా నాన్నా—లోకం పోకడ—

(తెరపడుతుంది)

# ఐదవరంగము

[పూలమొక్కల పూలుకోస్తూ పాట పాడుతుంది]

పం: జలజావల్లిక మోహనమల్లిక రారా నీటుబావా
తీయసు ధారమందార ధార నాప్రేమ గీతిక రావేల

సు: (తెరచాటున) మింగెడు ఊట నా ప్రే
మ బాట యీయవ్వన తటాకం

పం: ఏమిటో నవ్వులో యీ వికాసం
ఎందుకో నీ మోమాటం

సు: అడిగియుంటినే ఫిజిక్స్ నోట్సు
తెలుసుకొంటనే నీ ట్రిక్సు
పం; యేమిటి యీ మాయా
మాటలు బూటకమాయే
నటనలు నేర్చెను చాలా
సు: అంతిమరోజులు అందుకొనవే
నా అమృత సందేశం
పం: ఆ—యేమన్నావ్—ఎవరునువ్వు—
సు: మరువకమ్మా మరువకమ్మా
నీ యీక్వల్ మేటునే.
పం: (తొంగిచూస్తూ) జలజావల్లిక
మోహన మల్లిక రా రానిటు బావా
సురేంద్ర బావా నువ్వా
ఊహాప్రపంచంలోనుంచి భావి
ప్రపంచంలో లాక్కొచ్చావు బావా.

సు: నువ్వు నాకు ప్రపంచం నిజస్వరూపాన్ని చూపించావు. అవిజ్ఞానాన్ని పారదోలి విజ్ఞాన వీదుల్లో నడిపిస్తున్నావ్. సరే కాలమంతా మీదే.

పం: మాటలపైనకూడా అంత పెత్తనం చేస్తున్నావు మగ వాడవనా?

సు: పెత్తనంచేసె మగవాడుకూడ అలసిపోయాడు. అది కూడా మిమ్మల్ని ఆరాదిస్తోంది.

పం: ఏమిటిబావా ఈ మాటలు ఎందుకని?

సు: ఎందుకనా ఆసించినవారిని మోసంచేసే సుల్కాసైన

స్త్రీహృదయాన్నర్థంచేసుకోలేక "అర్థవంతమైన అంగ
డిలో అర్థాన్నంతా వ్యర్థంచేసికొని" జీవితాన్ని మలినం
చేసుకొన్నందుకు.

పం: వెళ్తూ. వెళ్తూ. శరత్ ఏమయినా యౌవన్న నేర్పి
వెళ్ళాడా.

సు: అంతకుమించిన కవులే యున్నారీ ఆంధ్ర దేశంలో.

పం: అయితే మలినపడినదాన్ని మరమ్మతు చేసుకో.

సు: చేసుకోడానికే వచ్చా.

పం: బావా...ఏమండీ సురేంద్రగారూ.

సు: ఏమిటండీ పంకజగారూ.

పం: మొన్న మ్యాటినీకి శేష్‌మహల్ కొస్తానని రాలేదే
మండీ.

సు: నాకు రేడియో స్టేషనుదగ్గర పనుండి వెళ్లాలెండి.

పం: ఓ...హో అలాగా అయితే యివ్వాళ వెళదాంరండి...
(చెయ్యి పట్టుకోబోతుంది.)

సు: పంకజా నిజంగా మీజాతివాళ్ళందరు నాటక మాడ
డంలో వీధిభాగవతులను మించిపోయారే...

పం: ఏం మాటలు చాలాదూరం పోతున్నాయి.

సు: పోవడమేమిటి సుందరంమాటలు దగ్గర కొస్తున్నాయిగా
చాలదూ.

పం: పో! బావా...రా! బావా సైమవుతూంది.

సు: మీ బావసుందరం. యింతకుముందే P. W. D.
Groundకి వెళుతున్నాడు వెళ్లు.

పం: ఎందు కనవసరంగా వాడిపేరు తలుస్తావ్?

సు: ఆ కపటనాటక మెందుకు. అంది తేజుట్టు అందకపోతే కాళ్ళుపట్టే బుద్ధిస్త్రీది.

పం: మాటలు సుతిమించి పోతున్నాయ్.

సు: ఏనాడో అచ్చుకొన్నా.

పం: ఏమిటీ యీఅపవాదు.

సు: బయటపడితే అపవాదు లేకపోతే కలగలుపు... అంతేనా

పం: ఏమంటున్నావ్.

సు: ఏమంటున్నానా స్త్రీబుద్ధి ప్రళయాంతకమంటున్నా.

పం: ఏమిటి యీ అన్యాయం.

సు: నీవు నాచదువుకూడా నాశనం చేశావు. నువ్వులేకపోతే భావ్యత్ ఎలా మారిపోయేదో నీకోసం నా సర్వస్వాన్ని ధారపోసా. సర్వమూ నీవే ననుకొన్నా.

పం: అయితే?

సుం: సాంఘిక జీవితం సుఖంగా జరగాలీ అంటే కొంత హద్దూ కొంత నీతీ అవసరం. అవి లేకపోతే మానవుని పట్ల వగ్గాలుండవు... ఎదుటి మనిషికి కష్టం కల్గకుండా నీ వెన్ని చట్టాలను, నాశనాలను ఉల్లంఘించినా తప్పులేదు. స్వార్థంతో చేయికలిపి ఎదుటి మనిషిని నిలువునా ఖూనీ చేయటమే మానవ లోకానికి మాయని మచ్చ. జీవితానికి ఎదురీదుతున్నామని అగ్నిసాక్షిగా పెండ్లాడిన భర్తను కాదని అవక తవకపనులు చేసి భారతనారీ సౌశీల్యాన్ని చంపటం ఎదురీతకాదు. విడాకులు వచ్చినాయికదా అని వివాహాలలోయుండే అందాన్ని సర్వనాశనం చేయడం ఎదురీతకాదు. చట్టాలను ఉల్లంఘించినా నైతిక ధర్మాన్ని

కాదనగూడదు. ఎన్నిటిని ఎదిరించినా అంతరాత్మను అనుసరించాలి.

పం: ఏమిటీ? నీ కవిత్వధోరణి?

సు: నిజం చెప్పితే ఉలుకు ఎక్కువ.

పం: అయితే నన్నుగురించి నీచదువుకే ఆటంకమొచ్చింది. అన్నిటికి కారణం నేనా?

సు: మీరుకాక ఇంకెవ్వరు? మీలాంటివారు. మీరేమిటి మీ స్త్రీజాతివాళ్లు కాలేజీలకు రాకుండాఉంటే ఏబాధ లేకుండా స్వేచ్ఛగా చక్కటిచదువుతో ఎక్కువ ఉన్న తోద్యోగాలలో కెంతమంది పోయేవాళ్లో.

పం: అంతవరకే చూస్తున్నావు? మీలాంటి అల్పబుద్ధులందరూ డబ్బుతో ప్యాసయ్యి విజ్ఞానము శూన్యమయ్యి జీరోడిగ్రీతో ప్రభుత్వాన్ని నిరుద్యోగమోఅంటూ బాధించకుండా మేమంతా దేశఔన్నత్యానికై మీ భావ్యత్ జీవితాలను వడపోత పోస్తున్నామ్. మే మెంత ఉపయోగపడుతున్నామో తెలుసా?

సు: తెలియకేం అంతేనా మీవల్లకాదు మగవాళ్లు తలకాయలు పగలగొట్టుకొనేది.

పం: సరేలే నీ సాధింపులు. రా వెళదాం.

సు: నీకు బుద్ధిలేదూ? నీచురాలా! నాతో కపటనాటకమాడుతున్నావా? చాటుచాటుగా కాతాలు కుదుర్చుకొంటున్నావటే? కుదుర్చుకుంటే కుదుర్చుకున్నావుగాని కాస్త మంచికాతా Book చేసికో.

పం: ఛీ... కాస్తమర్యాద నేర్చుకో.

సు: సుందరం ఎప్పుడొస్తా నన్నాడు.

పం: (మౌనం)

సు: నిన్న సుందరంతో గుసగుస చేస్తూ నాసంగతే ఎరుగ నన్నావటగా? నా మొఖమే తెలియదటగా?

పం: ఎవరన్నారు?

సు: అయిన నిన్నెవరడిగారు? ఆనాడు నా అవసరంకొద్ది కాలేజీ ఎలక్షనులో నిన్ను ఓటడుగవలసివచ్చి నిన్ను నేను ప్రాధేయపడి అడిగినందుకు... "నేనొకటడుగు తాను. సమాధానం చెపుతావా?" అంటూ నాలిముచ్చు మాటలన్నీ మాట్లాడి నన్ను మోసంచేసి రబస తెలియని రంగంలోకి నన్ను నటకుడుగా పంపి రిజిష్టరాఫీనుచుట్టూ తిప్పి సర్వనాశనంచేసి, చివరికి దీనికిపూనుకున్నావా... అతనే చెప్పాడు.

పం: కాదుబావా పొరబడుతున్నావ్.

సు: ఓసీ? కపట సంచారీ? నన్నే మోసం చేస్తున్నావా. వెళ్ళు నీ సుందరం పాదాలదగ్గరేయుండు. పో అవతలికి.

పం: ఛీ... స్త్రీ లోకానుభవంతో ఇతరులతో మాట్లాడిందా తోటిమానవులే అనుమానించటం మీ మగజాతికి పరి పాటేగా. అందుకనే స్త్రీ అన్నిరంగాలలోనూ వెనుకంజ వేసి స్త్రీయొక్క పౌరసత్వాన్ని సాధించలేకపిచ్చిదానిలా వ్యవహరిస్తుంది.

సు: అందుకనే పోయినువ్వు తాగి తందనాలాడు నాకు సంబంధంలేదు. మీ సుందరం ఎక్కడున్నాడో వెతు క్కోపో...

సుం: (ప్రవేసిస్తూ) హా...హా...హా...హా...బలే బలేరబస రండోయ్... రండి ...బలేవింత ... ఆలుమగలు తగవులాట... ఇక్కడ ప్రేమప్రతిపాదన... కేసువిచారణ...చూస్తారే రండి టిక్కట్టులేని డ్రామా...

పం: ఏడిసావ్... అవతలికిపో... నారదుడుతరువాత నువ్వే.

సుం: సావిత్రితరువాత నువ్వేననుకొంటూ!సానుల్లోపతివ్రతవు.

పం: ఛీ...నోర్ముయ్...కాపురాలు వేరుచేసి మనస్సులు తారుమారుచేసేపెద్దమనిషివిగదూమానవమాతృడవేనా?

సుం: ఊహు...

పం: నీచుడా. నువ్వు ఒక మానవుడవేనా? రాక్షసి.

సు: పో అవతలికి...నీచురాలా. (సుందరం వెళ్ళిపోతాడు)నా యింట్లోనుండి...నీ కోసం పదివేలు ఖర్చుచేసి యీ భవనంకూడా కట్టించాను.

పం: నే నేం వేశాను? చెప్పండి?

సు: నీ మూలాన అటు తల్లిదండ్రికి దూరమయ్యాను. ఇటు మానవత్వానికిమైలపడ్డా.

పం: నేను మీరు లేకపోతే ఎలా ఉండేదో మీతోనే సర్వ సౌఖ్యాలు అనుకొన్నా,

సు: (బటబట యేడుస్తూ) పో అవతలికి నా ఇంట్లోకి రావద్దు. శనిగ్రహమా. తలకాయలు మార్చటం మీ జాతికి అల వాటు. ఈర్ష్య మీ జాతికి మేటిలక్షణం. ఎదుటి హృద యాన్నర్థం చేసుకోలేకపోయినా మాట్లాడితేనే పొంగి పోయి గగుర్పొడిచే స్వభావం మీది.

(పడవేసి అవతలికి పోవును)

# ఆరవ రంగము

[రంగస్థలము: సుందరం తిరుగుతూయుంటాడు "నువ్వు ఒక మానవుడవేనా?" అనే మాట, అంతరాత్మలో తరంగాలు కొడుతూయుంటుంది సుందరం రంగస్థలముపై కూర్చుంటాడు]

సుం: నేను మానవుడ నెందుకుకాను
ప్రపంచమంతా గ్రుడ్డిది.
నేను మానవరూపంలోపుట్టి ఈ జగజగాలన్నీ
నడుపుతున్నా, నడుస్తున్నా యుగయుగాలు.

(పాట)

నేను ఒక మానవుడను, మరణించని మానవుడను
కాళరాత్రి గర్భంలో, కలలుగనేమానవుణ్ణి ॥నేను॥
భూతకాల వాహినిలో, వర్తమాన జగత్తులో
ఆగామికలోకంలో, నిదురించే శాశ్వితుణ్ణి
నేనూ ఒక మానవుణ్ణి
మరణించని మానవుణ్ణి
భూతలస్వర్గపు బాటల్లో
అణుబాంబుల రణరంగపువీధుల్లో
పోరుసల్పి విజయమొందిన, వీరోచిత ఆంధ్రుణ్ణి
నేనూ ఒకమానవుణ్ణి, మరణించని మానవుణ్ణి
స్వార్థహతమతస్థలి, హతమయ్యే ప్రాణికోట్ల
ఆకలితో అప్పులతో, కుమిలిపోయె ప్రజాశక్తుల
సౌభాగ్యపు హేలనకై, అనుక్షణం మరుక్షణం
ప్రజాస్వామ్య రథచక్రం, నడుపుతున్న సైనికుణ్ణి
నేనూ ఒకమానవుణ్ణి, మరణించని మానవుణ్ణి
విశ్వాన్నంతా ఒకటిగ జేసి, వీరరక్తాన్ని ధారగపోసి

రక్తవాహినిలో, ప్రజారాజ్యాన్ని ప్రతిష్టించి
జయభేరి విజయరణభేరి మ్రోగించి
ప్రఖ్యాతిగనే మానవుణ్ణి, నేనూ ఒకమానవుడను
మరణించని మానవుడను, అన్యాయాలనురూపుమాపి
అక్రమాలను అరికట్టి, ప్రజలె ప్రజలమేలుఁకోరి
పాలించె యుగంబిదని, చైయెత్తి జైకొట్టి
శాంతికి నిలయం ఈలోకం అనిపేరునిల్పె శాశ్వితుణ్ణి
నేనూ ఒకమానవుడను. మరణించని మానవుడను.

(ఆధారం రెంటాల)

ప్రకృతి: (Naturis voice) ఎవరవయ్యా నువ్వు? ఆవేశంలో అంతరాత్మను మలినపరుస్తున్నావ్.

సుం: అంతరాత్మ కాదు మలినపడేది. విశ్వజగత్తు.

ప్ర: అడగటం మరిచాను. ఇంతకు నువ్వెవరవు?

సుం: నన్నే యెరుగవా పిచ్చిదానా.

ప్ర: ఎరుగకనే కదా. చెప్పు నాయనా.

సుం: (వెర్రి చూపులు)

ప్ర: భయపడతా వెందుకు. చెప్పు పరవాలేదు.

సుం: అయితే నన్నెనుఁగవన్నమాట. యీ జగంపుట్టినప్పటి ఉంటున్నాను.

ప్ర: ఇంతకి ఎవరు నువ్వు. చెప్పు నాయనా. నా కర్థమవుతుందిలే నీ బాధ...

సుం: వెర్రిదానా; ఈ ప్రపంచాని కెంత వెనుకబడిఉన్నావు. అదిగో విశ్వస్వార్థరథం ముందుపోతూంది. పో వారితో కలువు. నా గాధ నీ కెందుకు.

ప్ర: చెప్పు. పరవాలేదు చెప్పు.

సుం: అయితే అడిగావుగనుక చెబుతున్నా విను. మీరు మమ్మల్ని చూడడంలేదేమోగాని నేనుమాత్రం అంతా చూస్తూనేయున్నాను.

ప్ర: ఎవరో ఒక నిర్మల హృదయుడులాగున్నావు. నీపనేమి బాబూ

సుం: ఇంకా తెలియదా? పాపం. నే నొకప్పు డేంచేస్తానో నాకే తెలియదు. అస లెవరికోసం, ఎందుకోసం బ్రతుకు తున్నానో అనేమాట అంతేలేదు. అయినా తెలియక ఏదో యీ ఇనుపహస్తాల కత్తులబోనులో యిరుక్కు-పోయానుగాని, ఆ సృష్టించిన శక్తియే లోకంలో నీకే జన్మ గావాలి యని నన్నడిగే చేస్తే ఏమి కోరుకొని యుండేవాడినో.

ప్ర: ఆ విచిత్రంగానేవుందే.

సుం: ఒక విచిత్రమేనా. జీవితమంతా ఒక నాటకరంగం. నీ కర్థంగాదులే.

ప్ర: ఇంతకీ నీ పనేమిటీ?

సుం: ఒకటేమిటి నేం చేసేవనా అగ్నిజ్వాలలతో మండిపో తూన్న ఇనపకమ్మిలపై సమ్మెటపోట్లువేసే కార్మికుణ్ణి. తీత్రాగ్నిలో సూర్యునిఎదుట మలమల మాడుతూన్న నల్ల నిరాళ్ళను నలిపే కర్షకుణ్ని స్వార్థాన్ని హస్తాబ్జలిలో నాశనంచేసి నూతన జీవితానికి కంకణం కట్టుకొన్న మానవుణ్ని ... ఇంకా ఎన్నో ... యెన్నో ...

ప్ర: అంతా అర్థంజేసుకొన్నా చీకటిని పటాపంచలుచేసి

లోకానికి వెలుగును విరజిమ్మే దివ్యజ్యోతికికూడా సంతోషము, శాంతి, సుఖములేదుకదా. అంతా అంధకారమేనా.

సుం: అవునుతల్లీ చీకటిని పారద్రోలి కాంతిరేఖలు విరజిమ్మే తేజోజ్యోతికి దాని సన్నిధానవల్లప్పుడూ చీకటేగదా.

ప్ర: నీ నివాసం?

సుం: అన్నిచోట్ల నేనే. ఎక్కడచూచినా కనబడతాను. రాజ్యాలేలేది నేనే. రాళ్ళు నలిపేదినేనే అంతఃపురాలలో ఆటలాడేది నేనే హర్షధ్వానాలతో అరకబట్టిదున్నేదీ నేనే. తిన్నదరుగక ఏడ్చేదినేనే తిండిదొరుకక కుమిలేది నేనే... నేను... మానవుడను. కలక్టరు ఆఫీసులో నేనే ఆపీసుల్లో గుమాస్తాను నేనే కార్మికుణ్ని నేనే కర్షకుణ్ని నేనే అంతా నేనే దయ, కరుణనిస్వార్థము ఉన్నచోటల్లా నేనుంటాను. నేనున్నచోటల్లా అవన్నీ ఉంటాయి. ఇక నే ఉండనిదల్లా స్వార్థంతో మునిగి, ప్రజలతో విలాసమాడే ధనికుల్లోను, ప్రజాశక్తులమని ప్రజల్ని మోసం చేస్తున్న వ్యక్తుల్లోను- అమానుషత్వం అనాదరత్వం అరాచకమంతా నాకు పుట్టుకతోనే శత్రువులు.

ప్ర: బాబూ మీకు కోర్కెలంటూ లేవా?

సుం: ఓ లేకేం.

ప్ర: అయితే మీకు స్వాధీనమవుతాయా. అసలుమీరు కోరుకొనేది మానవ సాధ్యమేనా.

సుం: అవునుతల్లీ అవును. ఈ విశాల మానవలోకంలో మనుష్యులంతా ఏకుమ్మడిగా ఒక త్రాటిపై నడవాలని

మాఆశయం. లోకంలో ప్రళయతాండవం ప్రబలిపోతూన్న స్వార్థాన్ని సర్వనాశనం జేసి ఆకలి అప్పులను హాత మార్చి మానవత్వానికి విలువ తెచ్చి జీవితం నిత్యకళ్యాణం పచ్చతోరణంగాచేసి యీ రాక్షసిలోకాన్ని రామ రాజ్యంగా మార్చాలని మా కోరిక.

ప్ర: ఆదర్శమయిన ఆశయాలతో నిండియున్న మీ హృదయాలు దగ్ధమయిపోతున్నాయి. ఇక చెప్పనవసరం లేదు. వద్దు చెప్పవద్దు.

సుం: ఎందుకమ్మా నివ్వింతగా విచారపడుతున్నావు. ఎవరు నువ్వు?

ప్ర: నేనా... చెప్పుకోటానికి నాయనా. పుట్టిన ప్రతి జీవి సృష్టిలో అందాన్ని ఆనందాన్ని సమానంగా పంచుకొంటారనుకొన్నాను. కాని స్వార్థంతో మానవుల్లో హెచ్చుతగ్గు లేర్పరచుకొన్నారు. రక్తబంధాలు ఒకటైన వర్గ వర్ణ భేదాలు సృష్టించి నిరుపమానను, అధర్మాన్ని ఆరాధ దేవతగా ఆరాధిస్తూ బీదబొమ్మలిన్ని తోలుబొమ్మలుగా చేస్తున్నారు ఇదంతా ఎవడుదాసిన ఎవడబ్బముల్లి మూలధనం. అంతా చూస్తేనేయున్నాను. నేను యీ లోకానికి ఆదిమాతను.

సుం: ఆ...

ప్ర: అవును ప్రకృతిని.

సుం: ఎవరు నువ్వా తల్లీ! ప్రకృతివా! ఎంతటి అదృష్టం ప్రకృతి, ఆదిమాత క్షమించు తల్లీ! తెలియక నా అజ్ఞో గతి ధోరణిలో నిన్నవకతవకలు చేశాను. క్షమించుతల్లీ!

ప్రి: లే నాయనా లే. కూర్చుంటే కార్యం నెరవేరదు. ఒక్క సారి విజృంభించి ప్రజాఘోషతో ఐక్యమై హెచ్చు తగ్గులు రూపుమాపి సమసంభంధ సామరస్యాన్ని ఏర్ప రచాలి.

సుం: అవును తల్లీ! అక్షరాల నిజము. సుందరమయిన ప్రపంచంలో సృష్టించబడిన అందాన్ని ఆనందించ డానికి మానవులందరూ వారసులే. స్వార్థంతో స్వార్థ పరులంతా అహంకారాన్ని విరజిమ్మి, ప్రజా హృదయా లకు మత్తుజల్లి బీద కళ్ళకు గంతలుకట్టి ప్రజల్ని నాటక మాడిస్తున్నారు. బీద బ్రతుకే ఒక విలాసంగా చూస్తు న్నారు. సహించటానికివీలులేదు. జిహ్వాకుండే రుచి ప్రక్కనే కత్తికూడా సాముపెట్టాలి. ఏం చేద్దాం తల్లీ!

ప్ర: ఏం చేయటమేమిటి?....మలినపడ్డ మానవలోకాన్ని మరమ్మతు చేయాలి. నాతో ఏకమా. యీ అరాచకా లను, అహంభావాలను, అహంకారాలను సరిహద్దులు దాటి పోనియ్యొద్దు. గొప్పకొద్ది విలువ చంపుకొని నీచ కార్యాలకు పూనుకొంటున్నారు. దీన్ని ఇంతటితో ఆపి వేయాలి.

సుం: అంటే!

ప్ర: అంటే. యీ లోకాన్ని మార్చివెయ్యాలి.

సుం: వేసి?

ప్ర: వేసి రామరాజ్యంలాంటి మరో నూతన ప్రపంచాన్ని సృష్టించాలి.

సుం: అదెలా సాధ్యం ?

ప్రి: కాదు. నాకు నువ్వు సాయపడు. నువ్వు నేను నేకమైతే సాధించలేని కార్యమంటూ లేదు. మౌనంగా కూర్చుంటే నిర్మలమైన హృదయాలు కుమిలిపోయి అశాంతి ప్రబలిపోతుంది. మానవలోకాని కవమానమొస్తుంది. రా... అనుమానించకు నాతో కలువు ఒక్కసారి లోకంపై చూసి మలినపడ్డజీవితాలను మరమ్మతు చేసుకోమని కేకవేద్దాం.

(పాట)

ఇద్దరు: ఓ వీరులార త్యాగులార, మహాజనుల్లార
కదలండికదలండి, మీరిక లేవండి లేచినడవండి
ఈసుబాధలగుపించని, మరో ప్రపంచ
మొకటుందోయ్ ॥ఓ॥

యంత్రంతో పోరుసలిపి యోచించేకార్మికుడా
పొలాలనన్ని హలాలదున్ని
చెమటోడ్చి కష్టించేకర్షకుడా.
ప్రేమపీఠమెత్తుకొని ఆశలన్ని బట్టుకొని
ఊగిసలాడే ఓవిద్యార్థీ, కలలుగనేమనస్వప్నాలుగనే
నవలోకం సృష్టిద్దాం పదండోయ్.
॥కదలండి ... కదలండి॥

అట్లుమోపిన ఓ ముద్దుగిత్తా, అరకబట్టిన ఓరైతుబిడ్డా
కలంపట్టిన కవిసోదరా, చంటిబిడ్డనెత్తుకొనీ
కడుపు చేతబట్టుకోనీ, వలసపోయె ఓ సహోదరీ,
కన్నతల్లి కన్నీరొలకని, ఆదర్శరంగ ధర్మసంచార
నిత్యకళ్యాణ పచ్చతోరణం,

ఆ దివ్యలోక మొకటుందోయ్
అగుపించేలోక మొకటుందోయ్.
భూలోక సంచార భూతలస్వర్గం
స్వార్థనిర్మూలనా స్వరూపచట్టం
(పంకజ ప్రవేసిస్తూ సుందరం కాళ్ళపై బడుతుంది.)
తప్పులెన్నుకొనే ప్రతిపాదనాయుక్తం
అన్నిటి కన్నువైనది యాలోకం
కలహాల కవమానమిచ్చి
చేయిచేయి కలుపుమిదే భాయీ
కదలిరమ్మిదే భాయీ
త్యాగంబు మనపుట్టినిల్లని చూపించాలిదే భాయీ.
ఐక్యస్వాతంత్ర్యమే మన జన్మహక్కని
దుక్కిదున్నే రైతుబిడ్డదే భూమిపై హక్కనీ
బాధ్యతకే హక్కు సాధ్యంబనీ
పరధ్యాన్నమే మానవుని జీవసమాధనీ
అనురాగ అందాల ఆ స్వర్గలోకనౌకలో పోదాము.
లేవండి లేవండి మాదివ్యమూర్తులారా
లేచి ముందడుగు వేయండి మాతోటి మానవులార
ఓ. వీరులార త్యాగులార మహాజనుల్లార
ఆదర్శప్రజల్లార పోదాము పదండి
వెళ్ళిపద్దాము నడవండి.

(న మ - స్తే.)



అతిత్వరలో రాబోవు నవలలు

★ స్త్రీ హృదయం

★ పూలమాల [పాటలు]

★ నవల నెం. 2

రచన: ధనకోటేశ్వరరావు.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA115B186 |
| పుస్తకం పేరు | మార్పు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 73 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | , CI, BCI . |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Rohith |
| స్కాన్ చేసినది | ch. Ramya |
| పరీక్ష చేసినది | pragatyhi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |